

## ఆ మనోహరమైన పిలుపు

కథల పుస్తకం చదువుతూ, ఎండలో, గడ్డిమీద పడుకున్నాడు దీపక్. శలవుల కని బడి మూసేసేందుకు అదే ఆఖరి రోజు. పక్కింటి స్నేహితుడు రఫీకి తన పాత పుస్తకం యిచ్చి, కొత్త కథల పుస్తకం తీసుకుని అప్పుడే బడినుంచి తిరిగి వచ్చాడు దీపక్. సాయంత్రం అయిదు గంటలకు అమ్మ పనిలోంచి తిరిగి వచ్చేలోగా పుస్తకం పూర్తి చేయాలనుకున్నాడు. వాడట్లా హాస్య కథల పుస్తకాలు చదువుతూ శలవులు వృధాచేయటం వాళ్ళమ్మ కిష్టంలేదు.

"పి – పిహా – పపి!"

కొత్తగా, కీచుగా వస్తున్న ఆ ఈల విని, గభుక్కున లేచి కూర్చున్నాడు దీపక్.



"పి – పీహా – పపి" మళ్ళీ ఆ వింత ఈల వినపడింది. దీపక్ గబుక్కున లేచి ద్వారం వైపు పరుగెత్తాడు. అక్కణ్ణుంచి వాళ్లింటి ముందున్న ఇరుకు సందులోకి వెళ్లాడు. ఆ సందు చివర ఒకతడు నిలబడివున్నాడు. అతను పొడుగ్గా, నల్లగా వున్నాడు. అతని మీసాలు భయంకరంగా వున్నాయి. అతని కళ్లు మెరుస్తున్నాయి. అతను దీపక్‌ని చూసి చిన్నగా నవ్వాడు. తెల్లని పంచ, పైన ముదురు ఎరుపు రంగు చొక్కా, ఇదీ అతడి వేషం. తల చుట్టూ వదులుగా పసుపు పచ్చని పెద్ద తలపాగా చుట్టుకున్నాడు. అతని చెవులకు మెరుస్తున్న బంగారు పోగులు వున్నాయి. వీపు మీద ఒక పెద్ద మూటవుంది. అతనిలాగే వేషం వేసుకున్న ఒక కుర్రాడు, చిన్న అబ్బాయి కూడా వున్నారు. ఆ చిన్నబ్బాయి తలపాగా మటుకు ఆకుపచ్చ రంగులో వుంది.

"పి – పీహా – పపి!" కీచుగా అరిచాడు పెద్దతను. అతని నోట్లో ఏదో ఈల లాంటిది వున్నట్లు దీపక్ గమనించాడు.

ఉన్నట్లుండి దీపక్ వెనక్కి తిరిగాడు. తన యింటి ముందరి తోటకూ, పక్కింటి ఆవరణకూ మధ్యవున్న కంచె దగ్గిరకు పరుగెత్తాడు.

"దిదో! ఒరేయ్ దిదో! బైటకి రా. త్వరగా రా!" అని పిలిచాడు హడావిడిగా.

"వస్తున్నానోచ్" సన్నగా పొడుగ్గా వున్న ఓ అబ్బాయి బయటికి పరుగెత్తు కొచ్చాడు. వాడే రఫీ, దీపక్ ప్రాణస్నేహితుడు. స్నేహితులంతా వాణ్ణి "దిదో" అని పిలుస్తారు.

"వస్తున్నా ..." అంది మరో కీచుగొంతు. ఉంగరాల జుత్తు, బుగ్గన సొట్టలు పడుతున్న నవ్వు, బొద్దుగా, అందంగా వున్న ఓ చిన్నారి బయటికి పరుగెత్తుకు వచ్చింది.

"పారో! నిన్ను నేను పిలవలేదే?" అని నసిగాడు దీపక్.

ఆ అమ్మాయి నవ్వు మాయమయింది. ఆ పిల్ల రఫీ చెల్లెలు. అన్నయ్యంటే అభిమానం. వయస్సు పదేళ్లే అయినా ఆ పిల్ల కెప్పుడూ అన్నయ్య చేసే పనులన్నీ తనూ చెయ్యాలనీ కోరికగా వుండేది. రఫీ, దీపక్ ఇద్దరికీ పన్నెండేళ్లు దాటాయి.

వాళ్ళ సరదా పాడుచేస్తూ పారో (ఆ పిల్ల నింట్లో అంతా అలా పిలిచేవారు) వెనక తోకలా రావటం దీపక్‌కి ఎంతమాత్రం యిష్టం లేదు.

"తనుంటే ఫరవాలేదులే... ఇంతకీ నన్ను ఎందుకు పిలిదావు?" అన్నాడు దిదో.

"ఆ సందులోకి ఒక బొమ్మలాటగాడు వచ్చాడు. బజారులో బొమ్మలాట చూపిస్తాడల్లే వుంది. ఆ తమాషా చూద్దాం పద."

వాళ్ళిద్దరూ సందులోకి దౌడుతీశారు.

"నన్నూ తీసికెళ్లరూ?" అని అరుస్తూ, పారో వాళ్ల వెనకాల పరిగెత్తింది.

"న.. న్ను.. కూ...డా.." మరో గొంతు వినిపించింది. బూరె బుగ్గలతో, లావుగా, బంతిలా దొర్లుకుంటూ వచ్చి ఓ కుర్రవాడు వాళ్ల వెనకాల పరుగు లంకించుకున్నాడు.

"చూడు! ఏం చేశావో! టుప్పోని కూడా మనతో తీసుకెళ్లక తప్పదు" అరిచాడు దీపక్.

"అందరమూ వెళదాం లేరా. పారో! నా చెయ్యి పట్టుకో" అని చెల్లెల్ని పిలిచాడు దిదో. అతనెప్పుడూ సరదాగా వుండేవాడు.

"పద టుప్పో! నా వీపు మీద ఎక్కు" అన్నాడు దీపక్ గత్యంతరం లేక. తన అయిదేళ్ల తమ్ముణ్ణి ఎత్తి వీపుమీదికి ఎక్కించుకున్నాడు.

వాళ్లు తొందరగా బజారు చేరుకున్నారు. అప్పుడే అక్కడ ఓ గుంపు గుమికూడి వుంది.

"పీ - పీహా - పపీ" బొమ్మలాటగాడు ఈల వేశాడు. "ఢం ఢం-!" అని పక్కన కుర్రాడి డోలు మోగింది.

పిల్లలు గుంపుని తోసుకుంటూ ముందుకు వెళ్లారు. తతిమ్మా వాళ్లతోపాటు కింద కూర్చున్నారు. బొమ్మలాటగాడు చిన్న పెట్టెలాటి రంగస్థలం కట్టాడు. పొడుగాటి దారాలని వేళ్లకు చుట్టుకుని, వెనకనుండి బొమ్మల్ని ఆడిస్తున్నాడు.

రంగం మీద ఒక దర్బారు దృశ్యం జరుగుతూంది. అమర్‌సింగ్ రతోడ్

అనే రాజు, హాడీ రాణి అనే అతని పట్టపురాణి, పైన మేడ వసారాలో ఆసీను లయివున్నారు.

ఆ కొయ్యబొమ్మలు చక్కగా ముస్తాబయి వున్నాయి. బొమ్మలాటగాడి మీసాల్లాగే రాజుగారి మీసాలు కూడా భయంకరంగా వున్నాయి. అతని చెవులకి చిన్న పోగులు, తలమీద కిరీటం వున్నాయి. ఎర్రని వెండి జలతారు దుస్తుల్లో అలంకరింపబడి వుంది రాణి. ఆమె మెడచుట్టూ నగలు ధగ ధగ మెరిసి పోతున్నాయి. వారి ఆసనానికి కిందగా ఒక నాట్యకత్తె నాట్యం చేస్తోంది. బొమ్మలాటగాడు ఆ నర్తకిని ఎంతో నేర్పుతో ఆడిస్తున్నాడు.

"పీ-పీహా-పీపా" ఈల వేశాడు బొమ్మలాటగాడు. ఢం ఢం అని డోలు మోగింది. ఇంతలో ఒక 'మదారీ' గారడీవాడు . . . వచ్చాడు. అతను పిల్లన గ్రోవి ఊదుతుంటే, బుట్టలోంచి ఒక పాము బైటికి వచ్చింది. ఒక కుక్క తల్ల క్రిందులుగా మొగ్గవేసింది. తెలుపు నలుపు మచ్చల కుక్క అది. ఉన్నట్లుండి ఒక దూత (బొమ్మ) పరుగెత్తుకుంటూ వచ్చాడు. శత్రువులు ముట్టడిస్తున్నారు. ఈ తమాషా చూస్తున్న అమర్‌సింగ్ రతోడ్ దిగ్గున లేచి, తన కత్తి అందుకుని నల్ల గుఱ్ఱం ఎక్కి వెళ్లిపోయాడు.

మరో రంగం ప్రారంభమైంది. ఇది "యుద్ధ రంగం." నల్ల గుఱ్ఱం మీద



అమర్‌సింగ్, ఎఱ్ఱ గుఱ్ఱం మీద అతని శత్రువు యుద్ధం చేయసాగారు. గుఱ్ఱాలు రెండూ ఢీ కొన్నాయి.

సైనికుల కత్తులు పరస్పరం దూసుకున్నాయి. ఢం ఢమ్మని మోగింది డోలు. "పి-పీహా-పపి" అంటూ ఈల వినపడింది.

అమర్‌సింగ్ గెలిచాడు. ఎఱ్ఱ గుఱ్ఱం మీది రాజు నేల కొరిగి మరణించాడు.

జనం సంతోషంతో చప్పట్లు కొట్టారు. పచ్చరంగు తలపాగ చుట్టుకున్న చిన్నబ్బాయి లేచి, మట్టి ముంత తీసుకుని బయలుదేరాడు. ఒక్కొక్కరి దగ్గరకు వచ్చాడు. జనం ఆ ముంతలో డబ్బులు పడేశారు.

"అయ్యో ! నాదగ్గర డబ్బు లేదు. నీదగ్గరుందా దిదో?" వాపోయాడు దీపక్. రఫీ మౌనంగా తల విదిలించాడు.

"నా దగ్గిర వుంది" అంటూ తన జేబులోంచి ఓ మెరుస్తున్న పావలా కాసు బైటికి తీసింది పారో. "అమ్మయ్య! వాడికియ్యి" అన్నాడు దీపక్. ఇలాంటి చిక్కు సమయాల్లో ఆడపిల్లలు పనికి వస్తారు కదా అనుకొన్నాడు.



పారో ఆ కాసును ముంతలో వేసింది. తతిమ్మా ప్రేక్షకులతో బాటు పిల్లలు బైటికి నడిచారు.

"దీపక్! తొందరగా పోదాం పద. ఇంటిదగ్గిర గాభరా పడుతుంటారు" అన్నాడు దిదో. వాళ్లు నలుగురూ సందులోపడి పరుగెత్తసాగారు.

"ఒరేయ్ దిదో! మనం కూడా ఒక నాటకం వేద్దాంరా!" అన్నాడు దీపక్ రొప్పుతూ. "మనకు అట్లాంటి బొమ్మలు కావాలిగా" అన్నాడు దిదో.

"నీ మొహం! వెఱ్ఱివాడా! బొమ్మ లెందుకు? మనమే వేషాలు వేద్దాం..."

"నేను అమర్‌సింగ్ రతోడ్‌గా వుంటాను" అన్నాడు దీపక్. కత్తి పట్టు కున్నట్లు చేతులు వూపుతో.

"అదే! నీ కావేషం అక్కర లేకపోతేనే" అన్నాడు దిదోతో.

"ఊహూ నాకు ఒద్దు. నేను ఆ ఓడిపోయిన రాజు వేషమే వేస్తాను. చచ్చి పోయినట్లు పడి వుండడం సరదాగా వుంటుంది" అన్నాడు దిదో. అలా అంటూ, కళ్లు తేల వేశాడు. చేతులు పైకెత్తి, కింద నేలమీద తూలిపడ్డాడు. ఆ హాస్య దృశ్యం చూసి పిల్లలంతా గొల్లుమన్నారు.

"న..న్నా..న.. న్నా" అంటూ బూరె బుగ్గల టుప్పో దిదో మీదకి దొర్లాడు.

"లే. దిదో" అరిచింది పారో. దీపక్ టుప్పోని దిదో నుంచి విడదీశాడు.

"చూడు! దీపక్! మీ ఇంటి ముందు ఒక టాక్సీ ఆగి వుంది. మీ అమ్మ నిన్ను పిలుస్తూంది."

"దీపక్! ఎక్కడికి వెళ్లావ్?" ఆదుర్దాగా పిలిచింది ఆ కంఠం. "బ్రతి కాను బాబూ! ఆ అల్లరి వెధవ టుప్పో కూడా వున్నాడు. మీరు ఇంట్లో కనపడక పోయేసరికి చాలా గాభరాపడ్డాను. బొంబాయి నుంచి ఇవాళ సాయంత్రం ప్రేమ్ మామయ్య వస్తున్నాడని జ్ఞాపకం లేదేమిటి? ఆఖరికి మామయ్య ఇంటికి వచ్చే సమయానికి ఎవ్వరూ లేరూ ...." అంటూ కొడుకుల్ని తిడుతూ వచ్చింది తల్లి.

"అమ్మా! నేను మర్చిపోలేదమ్మా ... మరేమో – బొమ్మలాట చూడటానికి వెళ్లాము. మామయ్యా! క్షమించవూ?" అన్నాడు దీపక్. టాక్సీలోంచి ఒక పొడుగాటి ఆయన దిగివచ్చి, దీపక్‌ను ఆప్యాయంగా కావలించుకున్నాడు.

"మరేం ఫరవాలేదు నాయనా! బొమ్మలాటగాడు బలే నిజమైన గమత్తులు చేస్తాడు. వాడి తమాషా చూడకుండా ఎలా వుండడం.. ఇదిగో నీ ఒదిన అనూ" అంటూ టాక్సీలోంచి దిగుతున్న ఓ పదహారేళ్ల అమ్మాయిని చూపించాడు.

"అనూ ఒదినా! నమస్కారం. నిన్ను ఇదివరకు చూసిన గుర్తులేదు" అన్నాడు సిగ్గుపడుతూ దీపక్.

"కానీ నువ్వు నాకు జ్ఞాపకం వున్నావు" అని నవ్వుతూ పలకరించింది అనూ. "నే...నో.. నే.. నో" అరిచాడు టుప్పో.

"వెధవా! నువ్వు కూడా" అంటూ అనూ వాణ్ణి ఎత్తుకుని గుండెలకు హత్తుకుంది. "అబ్బాయిలూ, సామాన్లు లోపలికి పట్టండి" అన్నది తల్లి.

"దీదో వాళ్లమ్మ మనందరి కోసం టిఫిను చేసి వుంచింది" అన్నదావిడ.

"బలే! బలే" అని అరుస్తూ పిల్లలు పెట్టెలు, సంచులూ తీసుకుని, లోపలికి పరుగెత్తారు.



## తెర లేచింది !

పెద్దలూ, పిల్లలూ పక్కింటి ముందు గదిలో గుంపుగా చేరి, బల్ల చుట్టూ కూర్చున్నారు. దిదో అమ్మ శ్రీమతి అన్వర్ బొద్దుగా, నవ్వుతూ వుంటుంది. కూతుర్ పర్వీన్ అచ్చం తల్లిలాగే వుంటుంది. ఆవిడ పెద్దలకి మధ్య కూర్చుంది, కప్పుల నిండా టీ, పిల్లలకి గ్లాసుల నిండా పాలు పోస్తూ, వాళ్లంతా కబుర్లు చెప్తుంటూ వేడి వేడి జిలేబీలు, పకోడీలు ఆవురావురు మంటూ తింటున్నారు.

దీపక్ అమ్మకు ఒక్కడే తమ్ముడు. ప్రేమ్ మామయ్యను చూస్తూంటే దీపక్‌కు సంతోషంగా వుంది. అఖిల భారత నాటకాల ఉత్సవంలో పాల్గొనేందుకు ప్రేమ్ మామయ్య తన నటీనట బృందంతో బొంబాయినుంచి వచ్చాడు.

అతని బృందానికి హింద్ - మంచ్ అని పేరు. అందులో మొత్తం ఇరవై మంది సభ్యులున్నారు. వాళ్లు ఇతర నాటక బృందం వాళ్లతో ఒక హాస్టలులో బస జేస్తున్నారు. కానీ తన అక్క వూళ్లో వుండటం వల్ల, ప్రేమ్ ఆయన కూతురు అనూ అక్కడ దిగారు. అనూ అప్పుడే హయ్యర్ సెకండరీ పరీక్షలు రాసింది. పరీక్షా ఫలితాలు వచ్చే ముందు శెలవులకంటూ ఇలా వచ్చింది. ఆ తరువాత కాలేజీలో చేరుతుంది. హింద్ మంచ్ బృందం వేసే రెండు నాటకాలలో ఒకదాంట్లో అనూ కూడా వేషం వేస్తుంది.

“మామయ్యా ! నువ్వు వేసే నాటకాలేమిటి ?” అడిగాడు దీపక్.

“రెండు నాటకాలు తీసుకొచ్చా మబ్బాయి ! అందులో ఒకటి చారిత్రాత్మక నాటకం. పేర్ల ‘తుగ్లక్’ మనదేశపు గొప్ప రాజుల్లో ఒకడు తుగ్లక్. అయన గురించిన నాటకాన్ని మనదేశపు ఒకాయన రాశారు” అన్నాడు మామయ్య.

“నువ్వు అంటున్నది పిచ్చి తుగ్లక్ గురించేనా?” అడిగాడు దిదో. అతనికి చరిత్ర అంటే ఆసక్తి.

“అవును. మహమ్మద్ తుగ్లక్‌ని పెట్టివాడనీ అన్నారు. గొప్ప మేధావి అని కూడా అన్నారు. ముసలితనంలో ఈ తెలివైన రాజు ఎలా నిర్దయుడిగా, దాదాపు పెట్టి ఆవేశంలో క్రూరుడిగా తయారయాడో చెబుతుంది ఈ నాటకం.”

“ఆ ఇంకో నాటకం?” అడిగాడు దీపక్.

“ఆ నాటకం నేనే స్వయంగా రాశాను. అది ఈ కాలపు జీవితాన్ని వర్ణించే సుఖాంత నాటకం.”

“నిజంగా నవ్వు పుట్టిస్తూ, సరదాగా వుంటుంది” అంది అనూ నవ్వుతూ.

“అందులో నువ్వు కూడా తమాషాగానే వుంటావ్” అన్నాడు తండ్రి.

“అనూ నువ్వు వేషం వేస్తున్నావా?” అసూయతో అడిగాడు దీపక్.

“అవును వేస్తూంది. చాలా బాగా వేస్తుంది కూడా” అన్నాడు మామయ్య.

“నాకు కూడా నటుణ్ణి అవాలని వుంది. మామయ్యా, నాకు హింద్-మంచ్‌లో వేషం ఇస్తారా?” గట్టిగా అడిగాడు దీపక్.

“అప్పుడే కాదబ్బాయ్. నువ్వింకా స్కూలు చదువు పూర్తిచెయ్యవలసి వుంది. అనూ త్వరలో కాలేజీకి వెళ్లబోతోంది. తరువాత, తను పంతులమ్మ అయేదీ, పత్రికా రచయిత్రి అనేదీ, నటి అయేదీ నిర్ణయించుకుంటుంది. మరి దీపక్, నువ్వు మీ నాన్నలాగ విమానం నడపవూ?” అడిగాడు మామయ్య.

“వద్దు బాబూ వద్దు” అంది శ్రీమతి అన్వర్ దీపక్ తల్లి వంక చూస్తూ. కానీ దీపక్ తల్లి మౌనంగా వూరుకుంది. కాస్సేపు ఎవరూ నోరు మెదపలేదు. అందరూ ఇబ్బందిగా కూర్చున్నారు.

దీపక్ తండ్రి ఫ్లయింగ్ ఆఫీసర్ అర్జున్‌దాసు, చాలా సాహసంతో విమానం నడిపేవాడు. కొద్ది సంవత్సరాల క్రితమే దేశ రక్షణ కార్యంలో మరణించాడు. భర్త పోయినప్పటి నుంచీ దాసు భార్య (దీపక్ తల్లి) ఒక బాలికల కళాశాలలో అధ్యాపకురాలుగా వుంటూంది. ఆవిడ కాలేజీకి వెళ్లినప్పుడు, పక్కయింటి అన్వర్ వాళ్లు ఆవిడ చిన్నకొడుకు టుప్పోని చూసుకొని సహాయ పడేవారు. దాసు భార్య

కాలేజీలో ఒక్కసారి బాగా చీకటి పడేదాక పాఠాలు చెప్పవలసి వచ్చేది. అలాంటి అప్పుడు శ్రీమతి అన్నవరే కొడుకు లిద్దరినీ చూసుకునేది.

"మునుపు విమానం నడుపుదామనే అనుకున్నాను. కానీ ఇప్పుడు నటుణ్ణి కావాలని వుంది. బొమ్మలాట నాటకం వేయాలని ఇప్పుడే మాట్లాడుకున్నాము. నేను అమర్‌సింగ్ రతోడ్ వేషం వేయాలని అనుకున్నాను" దీపక్ చెప్తూకు పోతున్నాడు.

"గాయపడ్డ రాజు నేను" అని అరుస్తూ, దిదో కుర్చీలోంచి రెండు చేతులూ వేళ్లాడేసి, కిందగా ఒరిగిపోయాడు. అందరూ పక పక నవ్వారు.

"నే ... ను .. కూడా ... నేను ... కూడా" అంటూ టుప్పో కూడా కుర్చీలో ఒరిగిపోబోయి, దప్పున కిందికి పడ్డాడు.

"అల్లరి వెధవా.... ఒక క్షణం వూర్కోవు కద...." అంటూ కేక వేసింది శ్రీమతి దాసు. అందరూ పగలబడి నవ్వుతుంటే, అనూ ఆ "గాయపడ్డ రాజు"ని లేవదీసింది.

"మామయ్యా! మాకు నాటకం వేయడంలో సహాయం చేస్తావా?" అడిగాడు దీపక్.

"తప్పకుండా, కానీ ముందు నాది పూర్తి కానివ్వండి అనూ! మనకు ఆలస్యమయిపోతోంది. మనం ఇక నాటకశాలకి వెళ్లాలి" అన్నాడు మామయ్య.

"వెంటనే వెళ్లాలా? ఇప్పుడేగా వచ్చారు?" అంది శ్రీమతి దాసు తమ్ముడితో.

"నీకు తెలిసే వుంటుంది, యివన్నీ ఎలా వుంటాయో. అక్కడికి వచ్చి రంగస్థల నిర్వాహకుణ్ణి కలుసుకుంటానని మాట యిచ్చాను" అన్నాడు ఆవిడ తమ్ముడు.

"మేం కూడా రామా?" అడిగాడు దిదో. "తప్పకుండా"

"నేను. . . . కూడా" అరిచాడు టుప్పో.

"ఊహూ, వీల్లేదు టుప్పో!" అడ్డుపడింది టుప్పో తల్లి.

"రానియ్యి అత్తయ్యా. వాణ్ణి నేను చూసుకుంటాను" అందుకుంది అనూ.

"మేం అట్టే ఆలస్యం చేయము. రంగస్థలం ఎలావుందో, దీపాలూ వగైరా సరిగా వున్నాయో లేదో చూసి వచ్చేస్తానంతే" అన్నాడు మామయ్య.

"మిమ్మల్ని నాటకశాల దగ్గిర దింపేయగలను" అన్నాడు అన్వర్. అతను మితభాషి. అంతవరకూ ఒక్కమాట మాట్లాడలేదు. "ఊళ్లో అటువైపు పని వుండి వెళుతున్నాను. ఒకర్ని కలుసుకోవలసి వుంది. ఓ గంట పోయాక మిమ్మల్ని కార్లో తిరిగి తీసుకు రాగలను."

సెంట్రలు థియేటరు దగ్గిర వాళ్లని దింపేసి అన్వర్ వెళ్లిపోయాడు. ఒక లావుపాటి అయన పరుగు పరుగున వచ్చి, ప్రేమ్ మామయ్యతో కర చాలనం చేశాడు. "మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషం. మీ స్టేజి – మానేజరు శ్రీ కట్కర్, లోపల మీ కోసరం కాచుకుని వున్నాడు" అన్నాడు. వాళ్లను ఒక విశాలమైన వసారాలోకి తీసుకెళ్లాడు. రెండు పెద్ద తలుపులు తెరుచుకుని వున్నాయి. వాళ్లు లోపలికి ప్రవేశించారు.

హాలులో దీపం మిణుకు మిణుకు మంటోంది. బారులు తీర్చిన కుర్చీలు ఖాళీగా వున్నాయి. హాలు చివర, రంగస్థలాన్ని, ఒక నల్లని బరువైన తెర కప్పేసి వుంది.

"తెర తీయండి!" ఉన్నట్లుండి కేకవేశాడు మామయ్య.

దీపక్ ఉత్సాహం పట్టలేక ఊపిరి బిగదీశాడు.

రంగస్థలం – నిశ్శబ్దంగా, చీకటిగా వుంది. అతను ముందుకు పరుగెత్తాడు. పక్కగా వున్న చిన్న మెట్లుమీదుగా రంగస్థలం పైకి ఎక్కాడు.

"రంగస్థలం మీద దీపాలు!" అన్నాడు మామయ్య.

ఒక నిముషంలో రంగస్థలమంతా కళ్లు జిగేలుమనిపించే దీపాలతో వెలిగింది. ఖాళీగా వున్న రంగస్థలం మధ్యన ఒకే ఒక చిన్న రూపం వుంది. అది దీపక్! వాడు మిణుకు మిణుకు మంటున్న హాలు ఒంక చూశాడు.

"వహ్వా!" అంటూ అరచి చప్పట్లు చరిచాడు దిదో. దీపక్ వంగి వారికి నమస్కరించాడు. పిల్లలంతా నవ్వుతూ చప్పట్లు కొట్టారు.

"నే...నో...నేను... కూడా" టుప్పో అరవడం మొదలెట్టాడు.

"రండి. అందరూ రండి. రంగస్థలం మీది ఆ నాయకుడి దగ్గిరకు వెళదాం" అన్నాడు ప్రేమ్ మామయ్య.

# నటుడి నివాసం

దీపాల వెలుగు నిండిన ఆ రంగస్థలం మీద ఒంటరిగా నిల్చుని, విశాలంగా చీకటిగా వున్న హాలువంక చూసినప్పుడు, దీపక్‌కు ఉన్నట్లుండి ఏదో ఆనందం కలిగింది. ఎంతో శక్తి పుంజు కున్నట్లయింది. ఇంతలో దిదో "వహ్వా!" అని అరవటం, దీపక్ వంగి వారికి నమస్కరించటం జరిగింది. కానీ ఆ క్షణంలో దీపక్ తనలో తానే ఒక నిర్ణయం చేసుకున్నాడు – దీపాలతో వెలిగిపోయే రంగస్థలం మీద, తను ఒక రోజు నిజంగా నిలబడి, ప్రేక్షకులకు తాను వంగి నమస్కరించాలి.

తరువాత అందరూ రంగస్థలం మీదికి వచ్చారు. "రంగస్థలం, రంగస్థలం వెనక భాగం నటుడికి నిజమైన ఇల్లు. రంగస్థలం మీదకి వచ్చినప్పుడు అతని సంతోషానికి అంతు వుండదు. హాలులోనుండి ప్రేక్షకులు మెచ్చుకుంటూ చప్పట్లు చరిచినప్పుడు అతడికి నిజమైన బహుమతి లభించిం దన్నమాట. అంతకంటే అతడు కోరుకునేదేమీ లేదు" అన్నాడు మామయ్య.

దీపక్ ఆలోచనలు కూడా ఆ ధోరణిలోనే వున్నాయి. నటులంతా తనలాగే భావిస్తారని వినేసరికి ఎంతో ఆశ్చర్యపోయాడు.

"కానీ ఆ ఘడియ వచ్చేందుకు చాలా శ్రమపడాలి. కష్టపడి పని చేయాలి. కలిసి పని చేయాలి. మొదట, ఈ రంగస్థలం అంటే ఏమిటో చెప్పనీయండి. ఈ రంగస్థలం — మధ్య, వెనుక, ముందు — యిలా మూడు భాగాలుగా విభజించబడింది. ఇందులో ఒక్కో భాగం మళ్ళీ మధ్య, కుడి, నడుమ అని విడదీయబడింది. ఈ గుర్తులన్నీ నటుడి దృష్ట్యా అవసరం. వీటిని ప్రత్యక్షంగా చూపిస్తాను. ఏదీ దీపక్! నువ్విలా రా."

సైక్లోరమా (తెర) వెనుక

| | | |
|---|---|---|
| వెనుక కుడివైపు | వెనుక రంగస్థలం | వెనుక ఎడమవైపు |
| మధ్య కుడివైపు | మధ్య రంగస్థలం | మధ్య ఎడమవైపు |
| ముందు కుడివైపు | ముందు రంగస్థలం | ముందు ఎడమవైపు |

ప్రేక్షకులు

"నే. . నో. . నే. . నో" అనూ చేతుల్లోంచి కేకవేశాడు టుప్పో. "సరి సరి! మొదట టుప్పో, అనూ, వాణ్ణి అలా రంగస్థలం మధ్య భాగంలో దింపు."

అనూ వాణ్ణి సరిగ్గా మధ్యకు దింపింది. మహా గర్వంగా నిలబడ్డాడు వాడక్కడ.

"దీపక్. నువ్విప్పుడు వాడి కుడి పక్కగా — అంటే మధ్య భాగంలో కుడి వైపు నుంచి హాలులోకి చూస్తున్నట్లు, నిలబడు. దిదో, నువ్వు ఎడం పక్కగా. ."

కుర్రాళ్ళిద్దరూ, చెప్పినచోట్ల నిలబడ్డారు. "అబ్బాయిలూ, ఇప్పుడు మీరు ముందు భాగపు కుడి, ఎడమ స్థానాలకు వెళ్లండి."

"అది ఎటువైపు?" అడిగాడు దిదో.

"ప్రేక్షకుల వైపుగా."

దీపక్ ముందుకు కుడి వైపుగా, దిదో ముందుకు ఎడం వైపుగా వెళ్ళారు.

"పారో, ఎక్కడున్నావ్?" అడిగాడు మామయ్య. "ఇక్కడ" అంది పారో నెమ్మదిగా. తన నెవరూ లక్ష్యం చేయడం లేదని పారోకి కోపంగా వుంది.

"తిన్నగా వెళ్ళి, టుప్పో వెనకాల నిలబడు. ఊహూ, ఇంకా వెళ్లగలిగి నంతవరకూ బాగా వెనగ్గా వెళ్లి, నిల్చో."

పారో పరుగెత్తుకుంటూ వెళ్లి, రంగస్థలం మధ్యగా వెనకగా వెళ్ళి నిలబడింది.

"ఇక్కడ ఒక గోడ వుంది. మరి ఇంకా వెనక్కు ఎలా వెళ్ళను?" అన్నది పారో.

కొద్దిగా వంకర తిరిగి వున్న గోడ రంగస్థలం వెనకపూర్తిగా వుంది.

"ఈ "గోడ" నే 'సైక్లోరమా' అంటాము. దీపాలు వేసి దానిమీద అనేక రంగులు, నీడలు తెప్పించవచ్చు. దిదో, ఇప్పుడు అటువైపు దాటి, కుడివైపు వెనక రంగస్థలంలో నిల్చో."

దిదో ఏమీ పాలుపోక నిలబడ్డాడు. అనూ తలతో సౌజ్ఞ చేసి అతనికి దారి చూపించింది. అతను వెంటనే, ఎదురు మూలకు పరుగెత్తాడు. దీపక్ వెనక, బాగా మూలగా నిలబడ్డాడు.

"దీపక్, నువ్వు వెనుక ఎడం వైపుకు వెళ్లు."

దీపక్ అడ్డంగా పరుగెత్తి, పారోకి కుడివైపుగా నుంచున్నాడు.

"నటులు రంగస్థలం మీద అటూ ఇటూ కదలవలసి వచ్చినప్పుడు, డైరక్టరు (నిర్దేశకుడు) ఈ విధంగా సలహాలిచ్చి, ఎక్కడెక్కడ నిలబడాలో చెబుతాడు. దీపాలు వేసే వాళ్ళకు కూడా అతడే అన్నీ చెబుతాడు. ఏ నటుడు తన కిష్టం వచ్చినట్లు రంగస్థలం మీద తిరగడు. అవసరమైనప్పుడే కదులుతాడు."

"కానీ హోరా హోరీ యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు ఏమవుతుంది?" అడిగాడు దీపక్. అతనింకా అమర్‌సింగ్ రతోడ్ వేషం గురించే కలలు కంటు న్నాడు.

"యుద్ధ రంగానికి కూడా, ఒక్కో అడుగు, ముందే ఆలోచించి పెట్టు కుంటాము. ప్రతి నటుడూ తన ఇష్టం వచ్చినట్లు తిరిగితే, గందర గోళమయి, అసలు జరుగుతున్నదేమిటో ప్రేక్షకులకు అంతుపట్టదు. ప్రతి నటుడూ మరో నటుడి ముందుకి నిలబడకుండా— దాన్నే "అడ్డుపడడం" అంటాము మేము— జాగ్రత్తపడాలి. అంతే కాదు; మరో నటుడు ఒక ఉపన్యాసం యిస్తున్నా, ముఖ్యమైన అభినయం చేస్తున్నా, ప్రేక్షకుల దృష్టిని మరల్చకుండా వుంచేందుకు, అతను నిశ్చలంగా వుండాలి. టూకీగా చెప్పాలంటే, నటుడన్నవాడు మంచి శిక్షణ పొందాలి. ఏమాత్రం స్వార్థం లేకుండా ఇతర నటులతో కలిసి కట్టుగా, పని చేయాలి. సరే, యిక రంగస్థలం మీది తతిమ్మా చోటు గురించి చెప్పనీయండి"

ప్రేమ్ మామయ్య, రంగస్థలం ఎడం వైపుగా, పెద్ద అట్ట పలకల వెనక్కి, పిల్లల్ని తీసుకెళ్ళాడు. "ఈ ప్రదేశాన్ని "పక్షాలు" (లింగ్స్) అంటాము. ఇవి రెండు వైపులా వున్నాయి. ఇది రంగస్థలం మీదే వున్నా! ప్రేక్షకులకు మాత్రం కనుపించదు. రంగంలోకి ప్రవేశించే ముందు నటులు యిక్కడే కాచుకుని వుంటారు. రంగస్థలం వెనుక పనిచేసే వాళ్లు కావలసిన వస్తువులన్నీ యిక్కడే పెట్టుకుంటారు. వీటిని "ఆస్తులు" అంటాము. ఉదాహరణకి సంచీ, గొడుగు లాంటివి. ... "

"లేక కత్తి ..." అందుకున్నాడు దిదో.

"లేక, నటుడికి రంగంలో కావలసిన ఒక కత్తి"

"అదేమిటి?" అడిగింది పారో. స్విచ్‌లూ, తీగెలూ, పెద్ద కొయ్య చేతి పిడులూ, వున్న ఒక పెద్ద పలకను చూపిస్తూ. దాని ముందు ఒక ఎత్తయిన బల్ల వుంది. "దీన్నే 'లైటు' 'డిమ్మర్ బోర్డు' అంటారు. ఈ స్విచ్‌లు నొక్కితే దీపాలు వెలుగుతాయి" అంటూ వివరించాడు మామయ్య.

"ఆ చేతి పిడులతో ఏంచేస్తారు?" అడిగాడు దీపక్.

"ఆ పిడులు కాంతిని క్రమంగా తగ్గిస్తాయి. వాటిని పైకి తోస్తే దీపాల కాంతి ఎక్కువవుతుంది. కిందికి తోస్తే తగ్గిపోతుంది. ఒక వరుసన వున్న దీపాలు ఆ విధంగా ఎక్కువ, తక్కువ కాంతిని యిస్తాయి. రంగస్థలం మీదికి వచ్చి పైకి చూడండి."

పిల్లలంతా పరుగెత్తికెళ్ళి పైకి చూశారు. టుప్పో తల బాగా ఎంత వెనక్కి వాల్చాడంటే, దప్పున కిందికి పడిపోయాడు. అనూ గబుక్కున వాణ్ణి ఎత్తుకుంది.

రంగస్థలం పై కప్పు బాగా ఎత్తుగా వుండి, బొత్తిగా కనపడటం లేదు. పైన జిగేలు మనే దీపాలు వరుసలు వరుసలున్నాయి. దీపక్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. తన జీవితంలో అన్ని దీపాలు అతనెన్నడూ చూసి ఎరగడు.

"ఒక్కో దీపాల బారుని ఒక 'బేటిన్' అంటాము. ఒక 'బేటిన్' దీపాలన్నిటికి కలిపి ఒకే స్విచ్ వుంటుంది."

"ఆ పెద్ద నల్ల దీపా లేమిటి?" అడిగాడు దిదో. పెద్ద బల్బులున్న విడి దీపాలని చూపిస్తూ.

"వీటిని 'స్పాట్' దీపాలు అంటాము. అవి చాలా కాంతివంతమైనవి. కానీ వీటివలన రంగస్థలం మీద కొద్ది మేరమటుకే వెలుగు పడుతుంది.

"బేటిన్ దీపాల కాంతినీ, స్పాట్ దీపాల కాంతినీ తగ్గించడానికి వీలుందా?" అడిగాడు దీపక్.

"వీలుంది. చూపిస్తా నుండు."

మామయ్య స్విచ్‌లున్న పలక దగ్గిరకెళ్ళాడు.

"మొదట ఆ మధ్యనున్న దీపాల వరుస కాంతిని తగ్గిస్తాను" అంటూ ఒక చేతి పిడిని నెమ్మదిగా తిప్పాడు. ఆ వరుసన వున్న దీపాల కాంతి క్రమంగా తగ్గిపోయి, చివరికి బొత్తిగా మాయమయింది. "ఇదిగో ఇక్కడ స్పాట్ దీపం

చూడండి.'' ధగ ధగ మెరుస్తున్న దీపం వెలిగింది. ప్రేమ్ మామయ్య మరో చేతి పిడి తిప్పుతుండగా, నెమ్మదిగా, ఆ దీపం కూడా ఆరిపోయింది.

''కట్మర్, ఆ ఎర్ర తెరని కిందికి దింపుతావా?'' అన్నాడు మామయ్య హటాత్తుగా.

''తప్పకుండా!'' అని జవాబు వచ్చింది. పైన తాళ్లు వాసాలు వున్న కప్పు దగ్గిర్నుంచి, కిర్రున చప్పుడయింది. పైనుంచి ఒక ఎర్రని తెర, వెనుక భాగం కనపడనీయకుండా కప్పివేస్తూ, రంగస్థలం మధ్యగా దిగింది. వ్రేళ్లాడుతున్న ఆ తెరను పొడుగాటి కర్రకు త్రాళ్లతో కట్టి వుంచారు.

''ఆ తెర వెనుక, పనివాళ్లు మరో రంగానికి అన్నీ అమర్చుతుంటే, నువ్వు ఈ రంగస్థలం ముందరి భాగంలో అభినయించవచ్చు. తెరను పైకి తీయండి'', అన్నాడు మామయ్య. ఆ ఎర్రని తెర పైకి పోవటం మొదలెట్టింది.

''నే. .నో. . నే. .నో'' అనూ చేతుల్లోంచి గిలగిల్లాడుతూ, అరిచాడు టుప్పో. పరుగెత్తుకుంటూ వెళ్ళి తెరని పట్టుకోబోయాడు,

''నువ్వుండరా బాబూ!'' కేక వేసింది అనూ.

''నటులను కూడా పైకి కిందకు పోయేటట్లు చేయడానికి వీలవుతుందా?'' అడిగాడు దీపక్. అచ్చం నాటకాల వాళ్లలా తనూ మాట్లాడుతున్నందుకు అతనికి గర్వంగా వుంది.

''వీలుంది. ఒక యువకుడు సర్కసులో వలె ఉయ్యాలలలో ఊగుతూ, బోర్లా పడుతూ, రంగస్థలం మీద దూకడం చూశాను.

''అబ్బ ఎంత బావుంటుందో! నాకు అట్లా చేయాలని వుంది'' అన్నాడు దిదో.

''రంగస్థలం నేలమీద ఒక తలుపు వుంది. దానిని తెరుస్తే రంగస్థలం కింది అంతస్తుకు దిగేందుకు మెట్లున్నాయి.''

''నాటకంలో ఏ దొంగో వస్తే పారిపోవడానికి ఎంత చక్కటి దారో!'' అన్నాడు దీపక్.

''ఇప్పుడు వేషాలు వేసుకునే గదులు గ్రీన్ రూమ్సు (పచ్చ గదులు) చూద్దాం. రంగస్థలం వెనుక వైపుకి రండి.''

రంగస్థలం పక్కలనుంచి వెళ్ళితే వసారాలాటిది వుంది. ఆ వసారా కవతల మూడు గదులున్నాయి. ఒక గది నిండా బీరువాలు, పెట్టెలు వున్నాయి. ఇక్కడే నటీనటుల దుస్తులు వుంటాయి. వాటి నిక్కడే ఇస్త్రీ చేస్తారు. తతిమ్మా రెండు గదుల్లోను పెద్ద అద్దాలతో వరుసగా అలంకరించుకునే బల్లలు వున్నాయి.

"కానీ ఈ గదులు గ్రీన్ (పచ్చ) గా లేవేం?" అడిగింది పాపో, తెల్లని గోడలకేసి చూస్తూ.

"గ్రీన్ రూమ్‌లంటే అలంకరించుకునే గదులు" అర్థం వివరించాడు మామయ్య. "ఇందులో ఒకటి నటులకి, ఒకటి నటీ మణులకి."

ఇంతలో బయటనుంచి రెండు మూడు సార్లు కారు హారన్ మోగింది.

"అది మన కారే!" బిగ్గరగా అన్నాడు దివో.

"పోదాం పదండి. నటుల ఇల్లు చూశారు. ఇక ఇళ్ళకు చేరండి. రేపు వచ్చి ఒద్దిక (రిహార్సిలు) చూద్దాము."

ఇంటికి పోయేందుకు అందరూ కార్లో ఎక్కుతుంటే, దీపక్, ఆ నాటకశాల తన స్వంత యిల్లులా ఎప్పుడవుతుందా అని ఊహించ సాగాడు.



## మొదటి నుంచి

మర్నాడు ఉదయం నాటకశాలకి వెళుతుండగా "మామయ్యా! మీరు నాటకం ఎలా వేస్తారు ?" అనడిగింది పారో.

"ఎంత పిచ్చి ప్రశ్న!" దీపక్ ఎగతాళి చేశాడు.

ప్రేమ్ మామయ్య అన్నాడు. "ఇదేం పిచ్చి ప్రశ్న కాదు. చూడు పారో! అసలు మొదటినుంచీ ప్రారంభిస్తాను. నాటకంలో వేషం వేయాలని తహ తహలాడే వారిని మొదట కూడ దీయాలి. అంటే, కేవలం వేషం వేసే వాళ్లనే కాదు. దుస్తులు కుట్టడం, రంగులు వేయటం, రంగస్థలంమీద పనులు చూడడం, దీపాలు వేయటం, శబ్దం సరిగా వుందా అని గమనించటం — ఇలా ఎన్నో పను లుంటాయి కదా. వీటన్నిటిని చేయాలనే ఆసక్తి వున్నవారన్నమాట. వారంద రినీ కూడదీశాక, ఒక మంచి నాటకం ఎన్నుకోవాలి."

"లేకుంటే కొత్తగా ఒకటి రాయాలి."

"కొత్తగా రాయాలంటే కష్టం, ఎంతో కాలం పడుతుంది కూడా. నాటకం ఎన్నిక అన్నది ముఖ్య ఘట్టం. అది ఒక విచార. . ."

"విషాదాంతమా ?" అడిగాడు దీపక్.

"కావచ్చు — లేక సరదాగా, హాయిగా వుండేది కావచ్చు."

"నవ్వొచ్చేదా ?" అడిగింది పారో. "నీ మొహం! నవ్వు పుట్టించేదే కాదు. సుఖాంతంగా వుండొచ్చు — అంతేనా ?" అడిగాడు దీపో.

"అవును . . . సరదాగా వున్నా, విచారంగా వున్నా, పురాణకాలం గురించి అయినా, ఈ కాలం గురించి అయినా, మీ నాటకం ప్రేక్షకులికి ఆశక్తిని కలిగించే

టుట్లుగా వుండాలి. లేకపోతే వాళ్లు నాటకం చూసేందుకు రారు. ఇహ నాటకంలో పాత్రలకు తగినంత మంది నటులు వున్నారా చూసుకోవాలి''.

''దాన్నే 'తారాగణం' అంటారు'' అంది అనూ. నటీనటులను పోగుచేశాక డైరక్టరుని (నిర్దేశకుడిని) ఎన్నుకోవాలి. ఆ తర్వాత అందరూ కూచుని ఓమాటు నాటకాన్ని చదవాలి. అనేక నాటకాల్ని చదివి విని ఆలోచించి ఏదో ఒకదాన్ని ఏరుకోవచ్చు. నటీనటులు వాళ్ల కిష్టమైన పాత్రల సంభాషణలను చదివి వినిపించ వచ్చు. చివరకు, ఎవరు ఏ వేషం వేయాలనేది డైరెక్టరే నిర్ణయిస్తాడు.''

''నాయకీ నాయకుల కంటె ఈ డైరెక్టరు ముఖ్యుడా?'' అడిగాడు దీపక్.

''అందరూ ఒక జట్టుగా కలిసి పనిచేస్తారు. అందరూ ముఖ్యమైన వాళ్లే. కానీ డైరెక్టరు ఈ జట్టుకు నాయకుడు'' సమాధానం చెప్పాడు మామయ్య. ''నటులు ఎలా అభినయించాలో అతడే ఆలోచించి, నిర్ణయించాలి. అంతేకాదు నటీనటులు తమ తమ పాత్రల్ని చక్కగా నిర్వహించేందుకు సహాయం చేస్తాడు.''

డైరెక్టరుగా వుంటేనే బాగుండేట్లుగా వుందే అన్న సందేహంలో పడ్డాడు దీపక్. ''డైరెక్టరు కూడా నాటకంలో వేషం వేయొచ్చా?'' అడిగాడు.

''తప్పనిసరి అయితేనే, మిగతా వాళ్ల అభినయాన్ని దిద్దుతూ, దీపాల కాంతి సరిగా వుందా, శబ్దం సరిగా వినపడుతుందా అని చూసుకుంటూ, దుస్తులు సరిగా వున్నాయా అని కనిపెడుతూ, రంగస్థలం మీద అన్ని హంగులు చక్కగా వుండేట్లు చూస్తూ వుంటాడు–డైరెక్టరు. అతడికి బోలెడంత పని వుంటుంది. అందు కని అతడు వేషం వెయ్యకపోవడమే ఉత్తమం.''

దీపక్ నిట్టూర్చాడు. ఒక జట్టుకి నాయకత్వం వహించటం బాగానే వుంటుందిగానీ, ''వేషం లేని'' నాయకుడు సరదాగా వుండలేడు అనుకున్నాడు. ''డైరెక్టరు తరువాత ఈ బృందంలో ముఖ్యమైన వారెవరు?'' అని అడిగాడువాడు.

''రంగస్థల నిర్వాహకుడు అనగా స్టేజ్ మేనేజర్'' మామయ్య సమాధానం అందరినీ ఆశ్చర్యపరచింది.

''అతడు 'ఒద్దికలు' (రిహార్సల్సు) జరిపించాలి. నటీనటులు తమ తమ సంభాషణలను బాగా ఒప్పచెప్పేట్లు చూడాలి; వేళకు రంగం తయారుగా

వుండేట్లు, దుస్తులు సిద్ధమయేట్లు చూసుకోవాలి; ప్రదర్శనానికి హాలు కుదుర్చు కోవాలి. టిక్కెట్లు అన్నీ అమ్ముడయేట్లు జాగ్రత్తపడాలి— నిజానికి ఈ నాటక బృందానికంతా అసలైన మేనేజరు అతను. కానీ రంగస్థల సేవకులందరిలో అతడే ఎంతో నిస్వార్థ పరుడు అనాలి. అతడెప్పుడూ రంగస్థలం మీదికి రాడు. అందుకని అతడెంత ముఖ్యుడో చాలామందికి తెలియదు.''

తను స్టేజి మేనేజరు మటుకు కాకూడదని దీపక్ నిశ్చయం చేసుకున్నాడు.

''కానీ మీరు నాటకం ఎలా వేస్తారు?'' మళ్లీ అడిగింది పారో.

''ఒకమాటు పాత్రల నిర్ణయమయాక, యిక ఒద్దికలు ప్రారంభించాలి. నాటకం పెద్దదయితే, మొదట్లో రెండు మూడు రంగాలు మటుకు ఒద్దిక వేసుకు చూసుకోవాలి చాలా నాటకాలలో మూడు భాగాలు లేక అంకాలు వుంటాయి. ఒక్కొక్క అంకంలో అనేక రంగాలు లేక (సీన్సు) వుండవచ్చు. నటీనటులు సమర్థులయి, ఉత్సాహవంతులయితే, వారి వారి పాత్రల మాటలను త్వరగా నేర్చేసుకుంటారు. డైరెక్టరు చెప్పిన విధంగా అభినయాన్ని నిముషాలమీద గ్రహించేస్తారు. కష్టమైన రంగాలను పదే పదే వేసుకు చూసుకోవాలి. తన పాత్రను సరిగా అభినయించడమే కాక యితర నటులకు పాత్ర పోషణలో సహాయపడడంలో కూడా ఒక నటుడు ఎంతో ఓర్పు వహించాలి.''

తను ఊహించినట్లుగా నటుడుగా కావటం అంత సులభమైన పని కాదని దీపక్ గ్రహించసాగాడు. ''నటీనటుల్లో ముఖ్యమైంది ఎవరు?'' అడిగాడు.

''మంచి నాటక బృందంలో, ఒక నటుడు మరొక నటుడికంటె ఎక్కువ కాడు, తక్కువ కాడు. కొన్ని పాత్రలు పెద్దవి, కష్టమైనవి అయివుండవచ్చు, కాని రంగస్థలం మీదికి వచ్చే ప్రతి వ్యక్తి ముఖ్యమైన వాడే. ఎక్కువ అభినయ కౌశలం వున్నవారికి, మంచి పాత్రలు యివ్వడం జరుగుతుంది. సరైన శిక్షణ తగినంత శ్రద్ధ చూపకపోతే, బజారు గుంపులో ఒకడి పాత్ర అయినా, ఒక పని వాడి పాత్ర అయినా, నాటకాన్ని పాడు చేయవచ్చు. చిన్న పాత్రలు నిర్వహించే నటులపట్ల - ఓపిగ్గా, శ్రద్ధ కనబరచే వాళ్లే, ముఖ్య పాత్రలను కూడా బాగా నటించగలవారు.

"దీపక్! నిజానికి, మా హింద్-మంచ్ బృందంలో, అన్ని నాటకాలలో ఒకే నటీనట బృందం ముఖ్య పాత్రలు వహించకుండా చూసుకుంటాము. ఒక నాటకంలో నాయకుడి పాత్ర వహించిన వ్యక్తి, రెండో దాంట్లో ఒక వృద్ధుడి వేషం వేయవచ్చు. మూడో నాటకంలో దారిన పోయేదానయ్య వేషం వేయవచ్చు."

దీపక్ ముఖం ఎర్ర పడింది. "అబ్బే! ప్రతిసారీ నేనే నాయకుణ్ణి అవాలని నా వుద్దేశం కాదు" అని బొంకాడు. అందరూ నవ్వారు.

"కానీ మీరు నాటకం ఎలా వేస్తారు?" మళ్ళీ అడిగింది పారో. జరుగుతున్న దాంట్లో సగం కూడా అర్థం కాలేదు పారోకి.

"మొదట ఒక్కో రంగాన్ని విడివిడిగా 'ఒద్దిక' వేసుకున్నాక మొత్తం నాటకం అంతా, అనేకమార్లు వేసుకుని చూసుకుంటాము. దుస్తులు, రంగాలకు కావలసిన యితర హంగులు తయారుగా వుండే నటులు ఒకసారి వేషాలు వేసుకుని, రంగస్థలం మీద ఒద్దిక వేసుకునే అవకాశం దొరుకుతుంది. ఒద్దికల కోసరం నాటకశాల అద్దెకు తీసుకుంటే బోలెడు డబ్బు ఖర్చవుతుంది. కనుక ఒకటి రెండు సార్లకంటె ఎక్కువగా రంగస్థలం మీద ఒద్దికలు వేసుకునే అవకాశం దొరకదు. వీటినే "వేషాలతో ఒద్దిక" (డ్రెస్ రిహార్సిల్సు) అంటాము. ప్రస్తుతం ఇక్కడ వేషాలతో ఒద్దిక జరుగుతోంది. చూద్దురుగాని రండి. రంగస్థలం మీద నటీనటులకు మాటలు, కదలికలు, అన్నీ బాగా అలవాటయేంత వరకు ఒక్కో రంగమూ పదేపదే ఒద్దిక వేయవలసి వస్తుంది. అందుకని మీరు చాలా నెమ్మదిగా, ఓర్పుగా వుండాలి. మేము దీపాలు కూడా సరిచూసుకోవాలి".

"టుప్పోని కూడా తీసుకురాకపోవటం మంచిదయింది. లేకపోతే అన్నిటికీ ముందు తయారయేవాడు" అంది నవ్వుతూ అనూ.

"అబ్బ! వాడా? వాడు మరీ కోతి వెధవ."

"నే. . నో . . నే . . నో" అంటూ, టుప్పోలా తమాషాగా అరిచాడు దిదో.

## వేషాలతో ఒద్దిక

నాటక శాలలోకి ప్రవేశిస్తూనే వాళ్లు ఓ పెద్ద శబ్దం విన్నారు. రంగస్థలం మీద తెర పైకి లేచి వుంది.

అనేకమంది అటూ ఇటూ హడావుడిగా తిరుగుతున్నారు. వడ్రంగులు సుత్తులతో కొడుతున్నారు. రంగస్థలం వెనక పనిచేసే వాళ్ళు ఒక రంగానికి కావలసిన హంగులన్నీ సమకూరుస్తున్నారు. విద్యుచ్ఛక్తి పనివాడు దీపాలు పరీక్షిస్తున్నాడు! టేపు రికార్డర్ మీద ఒకతను శబ్దాలు ఎలా వస్తున్నాయో అని వింటున్నాడు.

"మామయ్య పిల్లలతో నాలుగో వరసలోనో అయిదో వరసలోనో మధ్యగా కూర్చోండి నాకు పనుంది. కానీ అనూ మీ పక్కన కూర్చుని అన్నీ చెబుతుంది" అన్నాడు.

అనూకు రెండు వైపులా దీపక్, దిదోలు కూర్చున్నారు. పాకో అన్నయ్య పక్కన కూర్చుంది.

"సరే ఇక అందరూ రంగస్థలం మీంచి వెళ్ళిపొండి. కట్కర్! సిద్ధంగా వున్నావా?" కేకవేశాడు మామయ్య.

"ఓ" అంది ఓ కంఠం దూరంగా.

"దీపాలు ఆర్పేయండి!" అన్నాడు మామయ్య. అందరూ రంగస్థలం మీంచి వెళ్ళిపోయారు. దీపాలు ఆరిపోయాయి. తెరలు కిందికి దిగాయి. అంతా చిమ్మచీకటిగా, ఎంతో నిశ్శబ్దంగా వుంది.

"మొదలు పెట్టండి"

నెమ్మదిగా, దూరమూరంగా, "అజాన్" (మహమ్మదీయుల ప్రార్థనా

పిలుపు) వినపడింది. మెల్లిగా తెర లేచింది. నీడల్లా కనపడుతున్న కోట తోరణాలు, వంపులు తప్ప రంగస్థల మంతా చీకటిగా వుంది. ప్రార్థన పిలుపు బిగ్గరయిన కొద్దీ, రంగస్థలం వెనకాల, ఒక లేత నీలిరంగు కాంతి పడసాగింది. నగర దుర్గము, కోట బురుజుపై తోరణాలు, మెట్లు, గోడలు, — యివన్నీ ఒక్కొక్కటే కనుపించసాగాయి. పసుపు పచ్చ కాంతి రేఖలు, నెమ్మదిగా రంగాన్నంతా వెలుగుతో ముంచేశాయి.

"తెల్లవారిందనే విషయం దీపాలు ఎలా తెలుపుతున్నాయో చూశారా?" అంది అనూ మెల్లిగా. 'అజాన్' కూడా వేళని తెలియజేస్తుంది. దీనివల్ల ఈ నగరంలో మసీదులున్నాయని స్పష్టమవుతుంది. నిజానికి ఇది ఢిల్లీ నగరం "కట్కర్! దీపాన్ని పెద్దది చెయ్యి" మామయ్య గొంతు ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని భంగపరచింది.

"అలాగే!" పసుపు పచ్చని దీపపుకాంతి ఎక్కువయింది. రంగస్థలమంతా ఇప్పుడు దీపాలతో వెలిగిపోయింది. అద్భుతమైన దుస్తులు వేసుకుని, అనేకమంది రంగస్థలం మీదికి వచ్చారు. రంగు రంగుల జుబ్బాలు, పూలుకుట్టిన పొడుగాటి కోట్లు, చమికీల చిన్న కోట్లు, తలపాగాలు ధరించారు వాళ్లు.

"ఎంత చక్కని దుస్తులు" గొణిగింది పాపో.

"ఆ రోజుల్లో మనుష్యులు ఎలాటి దుస్తులు వేసుకుంటారో తెలుసుకునేందుకు, ఎన్నో పాతవర్ణ చిత్రాలు, దుస్తుల గురించిన పుస్తకాలు చూడవలసి వచ్చింది. చారిత్రాత్మక నాటకాలలో ఈ రకం వివరాల గురించి, చాలా జాగ్రత్తగా వుండాలి. సైనికులు ఎలాటి కత్తులు, డాలులు ఉపయోగించేవారో తెలుసుకునేందుకు, చిత్ర వస్తు ప్రదర్శనశాలకి కూడా వెళ్లాము. ఆఫ్ఘను రాజులు ఉపయోగించిన ఆయుధాలు, దుస్తులువేరు ; రాజపుత్రులు ఉపయోగించినవి వేరు."

ఆ నాటకం మధ్య యుగంలోని ఢిల్లీని చూపించింది పిల్లలకు. సైనికులు, రాజపుత్రులు, యాచకులు, గూఢచారులు, వ్యాపారస్థులు, రాజులు — మొదలైన వారిని చూశారు పిల్లలు. "తుగ్లక్ రాజు" వేషం వేసిన అతడు ఒడ్డు, పొడుగు వున్న అందమైన వ్యక్తి. అతని కంఠం ఎంతో హుందాగా, ఖంగున మ్రోగింది.

పిల్లలంతా ఆనందాశ్చర్యాలతో అతన్ని చూశారు. "రాజమాత" ని నడి బజారులో హత్య చేసేందుకు సిపాయిలు లాక్కుపోతుంటే, పారో గొల్లున ఏడిచింది. "అది నిజంగా జరిగిందా?" అడిగాడు చిదో, చెల్లెల్ని ఓదారుస్తూ.

"అవును. చిదో, ఈ సంఘటనలన్నీ చారిత్రాత్మకంగా వాస్తవమైన విషయాలు. కానీ, నాటక రచయిత వాటిని పొందుపరిచేటప్పుడు, తన వ్యక్తిగత అభిప్రాయాన్ని కూడా వెల్లడిస్తాడు. ఈ నాటక రచయిత గిరీష్ కార్నాడ్, తుగ్లక్‌ని, ఒక గొప్ప వ్యక్తిగా భావించాడు. తుగ్లక్ తన స్నేహితులందరి చేత, చివరికి రాజమాత చేత వంచింపబడ్డాడు. అందుకనే చివరి రోజుల్లో రాజు అంత ఆగ్రహపరుడుగా, క్రూరుడుగా తయారయాడు అంటాడు రచయిత."

"రాజూ! సరిగ్గా! ఇంకా బాగ..." కేకవేశాడు మామయ్య ఉన్నట్లుండి.

"మామయ్య ఏమిటంటున్నాడు?" రహస్యంగా అడిగాడు దీపక్.

"అదా! అరవకుండానే, స్పష్టంగా బిగ్గరగా మాట్లాడమంటున్నాడు" అంది అనూ.

ఆ రంగంలో రాజు ఒంటరిగా, దిగులుగా వున్నాడు. అతని పాత



స్నేహితుడు, చరిత్రకారుడు బరానీ కూడా వెళ్లిపోతున్నాడు. రాజు అతనికి వీడ్కోలు చెబుతున్న ఘట్టం అది. రాజు బరానీ పాత్ర వహిస్తున్నాడు.

"ఆ పంక్తులు మళ్లీ చెప్పు" అన్నాడు మామయ్య. నటీనటులు మళ్లీ మొదట్నుంచీ అభినయించటం మొదలుపెట్టారు.

"ప్రేక్షకులకు మాటలు స్పష్టంగా వినబడకపోతే, ఎంత బాగా అభినయించినా ప్రయోజనం లేదు," వివరించింది అనూ. "అభినయంలో మొట్టమొదట, ముఖ్యంగా నేర్చుకోవలసిన పాఠం ఇది."

నెమ్మదిగా నాటకం పూర్తయింది. ఆఖరి రంగంలో, రాజు వృద్ధుడయాడు. బాగా అలసి, కృంగిపోయి వున్నాడు. సంధ్యాకాలపు చిరు చీకటి నగర ప్రాకారాల మీద పడుతూంది. తల వంచుకుని, రాజు దిగులుగా, ఒంటరిగా మెట్లమీద కూర్చుని వున్నాడు. ఆ రంగం చూసి దీపక్ మనసు వికలమయింది. వెనుక దీపాల కాంతి తగ్గిపోయి, రాజు నీడ మిగిలింది. చివరికి అంతా చీకటిమయము.

"కట్కర్ ! హాల్లో దీపాలు, వేయి..." అరిచాడు మామయ్య.

"అలాగే !" హాలంతా కాంతివంత మయింది.

"అనూ, నేను శబ్దం, దీపాలు ఇంకోసారి సరి చూసుకోవాలి. నువ్వు పిల్లలను రంగస్థలం వెనకకి తీసుకెళ్లి నటీనటుల్ని పరిచయం చెయ్యి" అన్నాడు మామయ్య.

"ఓ బలే ! "తుగ్లక్" కి నన్ను పరిచయం చెయ్యవూ ?" అన్నాడు దీపక్.

"అతడు నా చిన్న పుస్తకంలో తన సంతకం పెడతాడా ?" అడిగాడు.

"తప్పకుండా.." పదండి పోదాం అంది అనూ.



## తెర వెనుక

వాళ్లు రంగస్థలం దాటి, అలంకరించుకునే గదుల వైపు వెళ్ళారు. అక్కడ ఒక లావుపాటి ఆవిడ, వాళ్ళని నవ్వుతూ ఆహ్వానించింది. నీలం రంగుచీర కట్టుకుని వుంది ఆవిడ. "అనూ, వీళ్లేనన్న మాట నీ అత్త పిల్లలు."

"సతీ అక్కయ్యా, దీపక్ ఒక్కడే నా బావ" సమాధానం యిచ్చింది అనూ. "వీళ్ళు పర్వీన్, రఫీ అని దీపక్ స్నేహితులు."

"పిల్లలూ! కోకాకోలా తీసుకుంటారా?" అడిగింది ఆవిడ. "ఓ. అలాగే."

ఇంతలో అడుగుల శబ్దం వినిపించింది. 'రాజు మహమ్మద్ తుగ్లక్' వాళ్ల ముందు నిలబడ్డాడు. "అక్కయ్యా, దయచేసి నాకు ఓ కప్పు టీ తెప్పించు" అంటూ లోపలికి వస్తూనే, తలమీద పాగా తీసేశాడు అతడు. "ఏయ్, అనూ" అంటూ, బంగారు జలతారు కోటు విప్పేశాడు.

"అహ్మద్ సాహెబ్, ఇతను నా బావ దీపక్. నాటకంలో నటించాలని ఆసక్తి. వీళ్ళు పర్వీన్, రఫీ అతని స్నేహితులు" పరిచయం చేసింది అనూ.

"ఏమిటబ్బాయ్! అయితే, నీకు వేషం వెయ్యాలని వుందా?" ఊఁ అంటూ అహమ్మద్ అబ్బాయిలతో కరచాలనం చేశాడు. పారో తల నిమిరాడు.

"మీ అంత బాగా నటించాలని . . ." అన్నాడు దీపక్.

"నువ్వు నా కంటె బాగా నటిస్తావులే" అంటూ నవ్వాడు అహమ్మద్. కోల్డు క్రీమ్ ముఖాన రుద్దుకుని, దూదితో తుడిచేసుకున్నాడు.

పిల్లలు చూస్తుండగా, అతని ముఖాన వున్న ముడతలు, గీతలు అన్నీ మాయమయాయి. ఆ తర్వాత అతను గడ్డంమీద కొంచెం నూనె రాసుకున్నాడు. గడ్డం రంగు తెలుపు నుంచి నలుపుకి మారింది. "గడ్డం తీసేస్తారా?" అడిగింది పారో.

"ఊహూ. ఇది నా స్వంత గడ్డమే.. కానీ "బరానీ" తన గడ్డం త్వరలోనే పీకేస్తాడు" అన్నాడు మహమ్మద్. అతనలా అంటుండగా, 'బరాని' వేషం వేసిన రాజు, లోపలికి ప్రవేశించాడు.

రాజు గడ్డాన్ని ముద్దలు ముద్దలుగా పీకేస్తూంటే, పారో జాగ్రత్తగా చూసింది. "దీన్ని మళ్ళీ ఎలా పెట్టుకుంటారు?" అడిగింది. "రంగులు పూసే అతడు దేశాయ్, యింకోటి తయారుచేస్తాడు" వివరించాడు రాజు.

"మీరు కూడా గడ్డం ఎందుకు పెంచుకోలేదు?" అడిగాడు దిదో.

"రెండో నాటకంలో నేను ఒక ఆధునిక యువకుడి వేషం వేస్తాను కనుక" అన్నాడు రాజు. నిజానికి ముఖానికి రంగంతా తీసేశాక, అతడు చాలా చిన్నవాడని స్పష్టమయింది. అతడు అనూ కంటే అట్టే పెద్దవాడు కాదు.

"అరె! మీరు చాలా పెద్దవారనుకున్నాను. మీ గొంతు కూడా వణికింది." ముసి ముసిగా నవ్వింది పారో.

"నేను పెద్దవాణ్ణని నువ్వు అనుకున్నందుకు సంతోషం. కానీ ఒక్క విషయం మటుకు గుర్తుంచుకో. వణుకుతున్న ముసలి కంఠం తెప్పించటం సులభం కాదు. నా కంఠం అసలైనంత దగ్గరగా వుందని అనుకోను" అన్నాడు రాజు.

"అవును. మామయ్య 'గట్టినా' అంటూ అరిచాడు కదా!" అన్నాడు దీపక్.

"అవును. కేకవేశాడు. అనూ, నా మాటలు స్పష్టంగా వినపడ్డాయా?" అడిగాడు రాజు.

"ఆ రెండోసారి చెప్పినప్పుడు వినపడ్డాయి."

"కానీ యువక పాత్రల కంటే ముసలి పాత్రలు వేయడమే నాకు ఇష్టం. అవి సవాలు లాటివి" చెప్పుకుపోతున్నాడు రాజు.

రాజు మాటలను మనసులోనే మననం చేసుకున్నాడు దీపక్. అవకాశం దొరికినప్పుడు తను కూడా ముసలి పాత్రలు వేయ ప్రయత్నించాలని నిశ్చయించుకున్నాడు. "రాణీ ఏరి? ఆవిణ్ణి తప్పక కలుసుకోవాలి" అంది పారో.

"ఆవిడ బాగా అలసిపోయి వుంది. విశ్రాంతి తీసుకునేందుకు బహుశః హాస్టలుకి తిరిగి వెళ్ళిపోయి వుంటుంది" అన్నది అనూ.



"పిల్లలూ, ఇవిగో కోకో కోలాలు తీసుకోండి" అంటూ సతీ అక్కయ్య హడావుడిగా లోపలికి వచ్చింది.

"రాజూ, నీ వస్తువులన్నీ ఇలా ఇచ్చెయ్యి. లేకపోతే పోగొట్టుకుంటావు"

"ఇవిగో అక్కయ్యా, తీసుకో" అంటూ, ఒక కర్ర, పుస్తకం, పర్సు ఆమెకి అందిచ్చాడు రాజు. "ఏం పిల్లలూ? రంగస్థలం వెనక, ఇవన్నీ చూడటం బాగుందా?" తలుపు దగ్గిరనుంచి మామయ్య అడిగాడు.

"మామయ్యా, చాలా బాగుంది. రంగస్థలం అమర్చిన విధానం చాలా బాగుంది" అన్నాడు దీపక్.

"బొంబాయి నుంచి మా సొంత సామగ్రి తెచ్చి రంగాలను అమర్చలేక పోయాము. అందుకని వీటిని నేషనల్ స్కూలు ఆఫ్ డ్రామా నుంచి ఎరువు తెచ్చుకున్నాము. ఇటీవల, వాళ్లు యిదే నాటకం వేశారు" అన్నాడు మామయ్య.

"అది నటీ నటులకి శిక్షణ యిచ్చే పాఠశాలా?" అడిగాడు దిదో. "అవును"

"ఎంత బాగుంది!" ముచ్చట పడ్డాడు దీపక్.

"రాజు ఇప్పుడే బి. ఏ. పూర్తి చేశాడు. పై సంవత్సరం ఈ పాఠశాల తెరవ గానే చేరుదామను కుంటున్నాడు" అన్నాడు మామయ్య.



"మహమ్మద్ సాహెబ్! మీరు కూడా అక్కడ శిక్షణ పొందారా?" అడిగాడు దీపక్.

"నాకు ఆ అదృష్టం చిక్కలేదు దీపక్. నా చిన్నతనంలో నాటకంలో తర్ఫీదు యిచ్చే పాఠశాలలు వుండేవి కావు. నేను అభినయం ఒక వృత్తిగా తీసుకున్న వాణ్ణికాను. సరదాకు వేషాలు వేస్తున్నాను. నేను ఒక కళాశాలలో ఉపాధ్యాయుడిగా పని చేస్తున్నాను. తీరిక సమయాల్లో హింద్ - మంచ్ నాటకాలలో పాల్గొంటాను. లేదా మా కళాశాలలో నాటక సమితి వేసే నాటకాలు డైరక్ట్ చేస్తాను. కానీ రాజూ, మీ తరం వాళ్ళు చాలా అదృష్టవంతులు. మీరు నటనను ఒక వృత్తిగా స్వీకరించవచ్చు."

"నువ్వు ఆ పాఠశాలను చూస్తావా, దీపక్?" అడిగాడు మామయ్య. "రేపు ఈ వస్తువులు వాళ్ళకు తిరిగి యిచ్చేసి, ఆ పాఠశాల డైరక్టరుకి ధన్యవాదాలర్పించాలి. రాజు కూడా స్కూలు చూసేందుకు వస్తున్నాడు."

"మామయ్యా, నాకు ఎంతో రావాలని వుంది" అన్నాడు దీపక్.

"ఇప్పుడిహ ఇంటికి త్వరగా తిరిగి వెళ్లాలి" అన్నాడు మామయ్య. భోంచేసి, మధ్యాహ్నం మూడు గంటలకల్లా నాటక రంగానికి రావాలి. సాయంత్రం ఆరున్నర గంటలకు నాటకం ప్రారంభ మవుతుందని మర్చిపోక."

# నటీనటులకు ఒక పాఠశాల

'తుగ్లక్' నాటకం చాలా విజయవంతమైంది. ప్రతిభావంతులైన ఆ నటీ నటులను, వారందరూ కలిసి కట్టుగా చక్కగా నటించడాన్ని ప్రతి ఒక్కరూ మెచ్చుకున్నారు. ముఖ్యంగా, 'తుగ్లక్' 'రాజమాత' 'బరానీ' పాత్రధారులను కొనియాడారు.

మరునాడు ఉదయం దీపక్, దిదో మామయ్యతో కలిసి, నాటకశాలకు లారీలో వెళ్ళారు. అక్కడ రాజు, కట్కర్ వున్నారు. రంగస్థల నిర్మాణానికి వాడిన హంగులన్నిటిని విడదీసి లారీలో ఎక్కించడంలో వాళ్లు సహాయ పడ్డారు. అక్కణ్ణుంచి వాళ్లు "నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామాకు వెళ్లారు. ఆ స్కూలు భవనం చాలా పెద్దది. చుట్టూ విశాలమైన ఆవరణవుంది. వాళ్లు లోపలికి వెళుతూండగానే, సన్నగా, అందంగా వున్న ఓ యువకుడు ఎదురు వచ్చాడు.

"రా రాజూ రా! మా పాఠశాల తరపున స్వాగతం!" అంటూ ఆహ్వానించాడు. సంతోషంతో "రమేష్! నిజంగా పాఠశాలలో నాకు ప్రవేశం వుంటుందా?" అన్నాడు రాజు.

"గత సాయంత్రం నిన్ను 'బరానీ' వేషంలో చూశాక, నువ్వు ఎన్నిక అయే అవకాశం ఎంతో వుందని నా నమ్మకం. నీ అభినయం అద్భుతం. అందుకో నా అభినందనలు."

"సంతోషం" అంటూ తన స్నేహితుణ్ణి అందరికి పరిచయం చేశాడు రాజు.

"మొదట సెట్‌లను వెనక్కు చేర్చాల్సిన కర్మాగారానికి వెళదాం పదండి" అన్నాడు రమేష్. అతడు వాళ్లను ఓ విశాలమైన గదిలోకి తీసుకెళ్ళాడు. అక్కడ చాలా రొదగా వుంది. ఒకతను విద్యుత్-రంపంతో పనిచేస్తున్నాడు. "ఇక్కడ

మేము నాటకానికి కావలసిన సెట్స్, తయారు చేస్తాము'' అంటూ అంత రొదనూ మించి వినపడేలా కంఠం ఎత్తి పలికాడు రమేష్.

ఒక మూల ఒక యువకుడు పనిలో నిమగ్నమయి వుండటం చూశాడు దిదో. ''అతడేమి చేస్తున్నాడు?'' అని అడిగాడు రమేష్‌ను. ''ఇతను 'రావు' మా విద్యార్థుల్లో ఒకడు. మేము వేస్తున్న నాటకంలో కావలసిన ఓ రంగానికి 'సెట్టింగ్' యొక్క చిన్న నమూనా తయారు చేస్తున్నాడు. పద, చూడు.''

ఆ నమూనా చాలా తేలికైన కర్రతో చేసినది. కుర్చీలు, మంచాలు, బల్లలు, తలుపులు అన్నీ కొలత ప్రకారం చేయబడ్డాయి. అది బొమ్మరింట్లో ఒక గదిలా వుంది. దాన్ని చూసి, దిదోకు చాలా ముచ్చట వేసింది.

''పారో వచ్చి వుంటే బాగుండేవి. ఇది చూసి చాలా సంతోషించేది. ఇలాటి నమూనా చేయడం నేను నేర్చుకుంటే బాగుణ్ణు.''

''నువ్వు నటుడివి కావాలని అనుకున్నావు కదూ,'' అడిగాడు రాజు.

''దీపక్ నటుణ్ణి కావాలని కోరుకుంటున్నాడు. నేను మా నాన్నలాగ వాస్తు శిల్పినవుతాను'' అన్నాడు దిదో.

''మంచిది. మంచి నాటకశాలలు నిర్మించేందుకు నాటకం, అభినయం గురించి కొంత తెలిసిన వాస్తు శిల్పులే కావాలి'' అన్నాడు మామయ్య.

''దీపక్ కూడా ఈ కర్మాగారంలో పని చేయవలసి వుంది. మా విద్యార్థు లంతా సెట్సు నమూనాలు వేయటం నేర్చుకుని, అవి నిర్మించేందుకు సహాయ పడవలసి వుంది. ఇప్పుడు, పాఠాలు జరుగుతున్న కొన్ని గదులకి వెళదాం పదండి'' అన్నాడు రమేష్.

రమేష్ వాళ్లని తీసుకెళ్లిన మొదటి తరగతిలో విద్యార్థులంతా తలలు క్రింద పెట్టి కాళ్లు పైకెత్తి వున్నారు! అది 'యోగ' తరగతి. విద్యార్థులు ఆసనాలు వేస్తుండగా వాళ్లు లోపలికి ప్రవేశించారు. రమేష్ వివరించాడు. ''యోగం ద్వారా నటుడి శరీరం సాగుతుంది; అతడు తన కండరాలను సడలించడంలో తోడ్పడు తుంది. సత్తువను కూడా అధికం చేస్తుంది.''

పక్క గదిలో ఘల్లు ఘల్లుమని గజ్జెలు, ఢమ్ ఢమ్మని డోలు మ్రోగుతున్నాయి. అక్కడ నృత్య శిక్షణ జరుగుతోంది.

"వాళ్లు ఒక జానపద నృత్యాన్ని నేర్చుకుంటున్నారు. నృత్యం ద్వారా నటుడిలో లాలిత్యం, లయజ్ఞానం ఏర్పడుతాయి. మా నాటకాలు చాలావాటిల్లో, ముఖ్యంగా జానపద నాటకాలలో, నృత్యాలు వుంటాయి."

ఆ పక్క గదిలో ఇద్దరు విద్యార్థులు ఒక పాట నేర్చుకుంటున్నారు.

"మేము సంగీతం కూడా నేర్పుతాము. సంగీత సాధన ద్వారా, కావలసిన రీతిలో కంఠం పలుకడం ఇప్పుడు అలవడుతుంది... లోపల వున్న చిన్న నాటకశాలకు పోదాం, రండి" అన్నాడు రమేష్.

నాటకశాల చాలా చిన్నది. శుభ్రంగా వుంది. వాళ్ళు నెమ్మదిగా లోపలికి ప్రవేశించారు. అక్కడ అభినయం నేర్పుతున్నారు. "విద్యార్థులు ఆశు రీతిలో అప్పటికప్పుడు అభినయం చేస్తున్నారు" అన్నాడు రమేష్ తగ్గుస్థాయిలో.

"అంటే?" అడిగాడు — దిదో.

"గురువు వాళ్లకు ఒక కథ యిచ్చాడు. వాళ్ళు ఆ కథకు తగిన కల్పనలు చేసుకుంటూ అభినయించాలి. దీన్నే "మూగ నటన" అంటారు. మాటలు లేకుండా, చేష్టల ద్వారా, ముఖ భంగిమల ద్వారా భావాన్ని తెలుపుతారు."

రంగస్థలం మీద ఇద్దరబ్బాయిలు, ఒక అమ్మాయి వున్నారు. అబ్బాయిలు పోట్లాడుకుంటుంటే, అమ్మాయి గొల్లున ఏడుస్తూ, వాళ్లను విడదీయ ప్రయత్నించింది. ఉన్నట్లుండి, ఒక అబ్బాయి, శత్రువుకు బదులు ఆ అమ్మాయిని దారుణంగా కొట్టాడు. అమ్మాయి క్రింద పడిపోయింది. అబ్బాయిలు తగవు ఆపేసి, ఆ పిల్లని లేవదీయ ప్రయత్నించారు. కానీ ఆమె కదలకుండా, చేష్టలుడిగి పడివుంది. అబ్బాయిలు దుఃఖంతో తమ దెబ్బలాట మానేశారు.

"సరే. ఇక్కడ ఆపండి" అంది ముందు వరుసలో కూర్చున్న ఒకావిడ. ఆవిడే అభినయం నేర్పుతున్న గురువు. "ఇప్పుడు ఈ రంగాన్ని గురించి చర్చిద్దాము. దీనికి ఏ విధంగా ఇంకా మెరుగులు దిద్దవచ్చో చూద్దాము."

వాళ్లు బయటికి వచ్చేస్తుండగా, ''ఆరుబయటవున్న రంగస్థలానికి వెళదాం రండి'' అన్నాడు రమేష్ మెల్లిగా.

''అబ్బాయిలను నీతో తీసుకువెళ్లు. నేను ఈలోపు డైరెక్టరు గారిని కలుసుకుని, మీ దగ్గరకు వస్తాను'' అన్నాడు మామయ్య.

ఆరుబయిట రంగస్థలం ముచ్చటగా వుంది. అది చూసి వాళ్లంతా చాలా సంబరపడ్డారు. ''మా విద్యార్థుల సహాయంతో ఇది తయారయింది'' అన్నాడు గర్వంగా రమేష్. ''ఇంకా ఏమేమి నేర్చుకుంటారు?'' అడిగాడు రాజు.

నృత్యం, యోగం, సంగీతం అభినయం కాక, ఇంకా దుస్తుల అలంకరణ, రంగాలంకరణ నేర్చుకుంటాము. భారతీయ నాటకాలు, విదేశీ నాటకములు చదివి చర్చిస్తాము. పాత సంస్కృత నాటకాలు, ఈనాటి మన నాటకాలూ కూడా వేస్తాము.

''సంస్కృతంలోనా?'' అడిగాడు దీపక్ ఇదంతా విని గాభరాపడిపోతూ.

''కాదు. హిందీలో..'' అన్నాడు రమేష్ చిరునవ్వుతో.

''మేము వేసే విదేశీ నాటకాలన్నీ హిందీలోకి అనువాదం చేసుకుంటాము'' అని రాజు వైపుకి తిరుగుతూ, ''నేను నిర్మాత అయేందుకు శిక్షణ పొందుతున్నాను. మీరు అభినయంలో ప్రత్యేక శిక్షణ పొందుతారా?''

''అవును. ముందు ప్రవేశం అంటూ దొరికితే'' నవ్వాడు రాజు.

''ఇది అభినయం నేర్పే పాఠశాల అనుకున్నాను'' అన్నాడు దిదో.

''ఊహు. నాటకరంగానికి సంబంధించిన అన్ని అంశాలలోనూ శిక్షణ ఇస్తారిక్కడ. నటుడు, నిర్మాత, సాంకేతిక నిపుణుడు ఏమి కావాలన్నా ఇక్కడ తర్ఫీదు పొందవచ్చు.''

''నాకు నటుణ్ణి కావాలని వుంది'' అన్నాడు దీపక్. ''ఈ వూరు విడిచి వెళ్ళేలోగా, మామయ్య మా మొదటి నాటకానికి సహాయం చేస్తానన్నాడు.''

''అది వేసేటప్పుడు నాకు తెలియజేయండి. తప్పక వస్తాను'' అన్నాడు రమేష్. ''తప్పకుండా రావాలి!'' అంటూ నవ్వాడు దీపక్. ఇంతలో మామయ్య అక్కడకి వచ్చాడు.

అనూ తోటలో కూర్చుని వుంది. పుస్తకం చదువుకుంటూ తల తడి ఆరబెట్టు కుంటోంది. ఆమె జుత్తు వుంగరాలు తిరిగి, పొడుగ్గా వుంది. అంతకు క్రితం రోజు సాయంత్రమే హింద్ మంచ్ వారి రెండో నాటకం వేశారు. ఈ నాటి యువతీ యువకుల సమస్యల్ని పరిష్కరించే ఆ నాటకం ప్రజల మన్ననలను అందుకుంది. అందులో అనూ ఓ వేషం వేసింది. అందుకని కొంచెం అలసిపోయి వుంది.

టుప్పో, బోర్లా పడుకుని, గాలిలో కాళ్లు ఆడిస్తూ బొమ్మల పుస్తకంలో ఒక బొమ్మకు రంగులు వేయడంలో నిమగ్నుడయివున్నాడు.

ఉన్నట్లుండి, దీపక్, దిదో గేట్లోంచి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

'అనూ ఒదినా!' అని రొప్పుతూ, దీపక్ అనూ పక్కన చతికిలబడ్డాడు. "మామయ్య మనకోసరం ఒక నాటకం ఎన్నిక చేశాడు. అది వేయడంలో మనకు సహాయం చేస్తానన్నాడు. నా స్నేహితుల్ని కొంతమందిని నటించమని అడిగాను. దయచేసి నువ్వు మా డైరెక్టరుగా వుంటావా? ఎందుకంటే, మా అందరిలోకి నీకే ఈ విషయాల్లో జ్ఞానం ఎక్కువ అన్నాడు మామయ్య. అదీ కాక, నాటకం పనంతా చిన్నవాళ్లు ..."

"బాబూ! ప్రవాహాన్ని కాస్త ఆపు... నెమ్మదిగా మాట్లాడు: లేకపోతే నా చెవులు పగిలిపోతాయి" అని బ్రతిమాలింది అనూ, అతని వాగ్ధాటికి తట్టుకో లేక. "అబ్బాయ్, నువ్వింత గడ గడ మాట్లాడావంటే, ఎన్నటికీ నటుడివి కాలేవు" అంది కోపం నటిస్తూ. "కానీ అనూ ఒదినా? నువ్వు తప్పక చేస్తావన్న మాట ఇయ్యి?"

"ఏమని మాటివ్వాలి ?"

"మా నాటకం డైరెక్టు చేస్తాననీ"

"ఏ నాటకం ?"

"ఇప్పుడే కదా చెప్పాను . . ." దీపక్ గోలపెట్టాడు.

దిదో అందుకున్నాడు. "దీపక్, నన్ను చెప్పనీ. ఆవేశంలో నువ్వు సరిగ్గా మాట్లాడ్డంలేదు. 'అమర్‌సింగ్ రతోడ్' నాటకం వేయాలని దీపక్ అనుకున్నాడు. కానీ మా దగ్గిర ఆ నాటకం లేకపోవటం వల్ల, మామయ్య మరో నాటకం తీశాడు. "పంచ తంత్రం" లోని ఒక కథ మీద ఆధారపడిన నాటకం అది. పేరు "కృతఘ్నుడు."

"అరె! ఆ నాటకం నాకు తెలుసు. అది వేయటం నాకు చాలా యిష్టం" అంది, అనూ ఆక్రిసతో. "నే. . .నో. . నేనో. ." అరిచాడు టుప్పో, రంగుల పెట్టె పక్కకి గిరవాటేస్తూ.

"ఆ! నువ్వుకూడా" మాట యిచ్చింది అనూ. "కానీ దీపక్, అన్ని పాత్రలూ వేసేందుకు తగినంతమంది స్నేహితులున్నారా నీకు? దసరా శెలవులకి స్కూలు మూసేశారు కదా, నీసహ విద్యార్థుల్లో చాలామంది ఊళ్లకు వెళ్లిపోలేమా ?"

"నా స్నేహితులు చాలామంది ఇక్కడే వున్నారు ఒదినా. ఇవాళ పొద్దున్నంతా, నేనూ, దిదో అందరినీ అడిగి వచ్చాము. ఇవాళ సాయంత్రం నాలుగు గంటలకల్లా, వాళ్లందరినీ ఇక్కడికి పిలిచాడు. హింద్ - మంచ్ బృంద మంతా ఇవాళ రాత్రి వెళ్ళిపోతున్నారు గానీ, నువ్వు, తనూ సెలవులయేంత వరకూ మాతోనే వుంటారని మామయ్య చెప్పాడు. కనుక, నాటకం వేసేందుకు మనకు ఇంకా పదిహేను రోజుల వ్యవధి వుంది."

"నాటకం చాలా పెద్దది" గొణిగింది అనూ. పోనీలే తగ్గిద్దాము ... ఇదిగో నాన్న !"

నాటకం ప్రతి ఒకటి పట్టుకొచ్చాడు మామయ్య. మొదట అందరూ కూర్చుని నాటకంలోని వివిధ పాత్రల మాటలు రాసేసుకున్నారు. నాటకం వేసేందుకు అట్టే రోజులు వ్యవధి లేదు. అందుకని మామయ్య, అనూ కలిసి, పిల్లలు పాత్ర

మాటలను సులభంగా కంఠస్థం చేసేందుకు వీలుగా నాటకంలోని కొన్ని రంగాలు తీసేశారు. "నాటకం ఎక్కడ వేద్దాము?" అని అడిగింది అనూ.

"ఆరుబయట తోటలో వేసుకోవచ్చు. అన్వర్‌తో మాట్లాడాను. అతని స్నేహితుడొకడికి, ఇంటిముందు పెద్ద తోట వుందిట. అది ఇక్కడికి దగ్గర వుంది. అతడిని అడుగుతానన్నాడు."

"ఓ.. అదా.. కపూర్ గారిల్లయి వుంటుంది" అన్నాడు దిదో. "అవును. అనూ, ఆ తోట చాలా విశాలంగా వుంటుంది. ఎదురుగా పెద్ద డాబాలాటిది కూడా వుంది. మనం ఆ డాబా మీద నాటకం వెయ్యొచ్చు. వచ్చిన వాళ్లు కింద తోటలో కూర్చుంటారు."

"ఆ డాబా మరీ ఎత్తుగా లేదనుకుంటాను" అంది అనూ.

"ఊహూ. లేదు తోటనుంచి సరిగ్గా రెండు మెట్లు ఎత్తున వుంది అంతే."
"అలాగయితే నాన్నా మరి దీపాల విషయం ఏమిటి?"

"నాటకం సాయంకాలం కదా వేస్తున్నది. రెండు మూడు "స్పాట్" దీపాలకంటె ఎక్కువ అవసరం వుండదు. ఒక నాటకాల మిత్రుడి సాయంతో దీపాలు అద్దెకు తెచ్చుకుందాము." అని మామయ్య దీపక్ వైపు తిరిగి "దీపక్ నేను మీ రంగస్థల నిర్వాహకుడిగా వుంటే మంచిదేమో. దిదో నాకు సహాయకుడిగా వుంటాడు" అన్నాడు.

"అలాగే!" అన్నారు కుర్రాళ్లు.

"నాన్నా! ప్రతీ పనీ పెద్దవాళ్ళకు అప్పజెప్పి వారికి సాయంగా పిల్లలను వుంచితే మంచిది" అంది అనూ. "దిదో, మీ అమ్మ సహాయం చేస్తారంటావా?"

"అమ్మ మన దుస్తులు తయారు చేస్తుందేమో కనుక్కురమ్మని ఇప్పుడే పారోని పంపాను. గుడ్డలు కత్తిరించి కుట్టడంలో అమ్మ చాలా నేర్పరి. అద్భుతమైన దుస్తులు తయారు చేస్తుంది. వినోద వేషాల ప్రదర్శనాలలో నేనూ పారో ఎన్నో బహుమతులు గెలిచాము. మా దుస్తులు మేము ఎప్పుడూ బయట కొనము. అమ్మ తనే నమూనాలు వేసి వాటిని తయారు చేస్తుంది. అమ్మకు సహాయం చేయటమంటే పారోకి సరదా." "నేను ...కూడా" అరిచాడు టుప్పో.

"టుప్పో అన్నీ చిందరవందర చేయడంలో తోడ్పడతాడు" అన్నాడు దిదో. అందరూ నవ్వారు.

సాయంత్రం నాలుగయేసరికి, అబ్బాయిలు, అమ్మాయిలు, దీపక్ ఇంటికి రావటం మొదలెట్టారు. నాలుగు గంటల పదిహేను నిముషాలయేసరికి చాలా మందే గుమికూడారు. బయట గడ్డిలో తివాసీ పరచాలనుకుంది అనూ.

అనూ "డైరెక్టరు" ధోరణిలో ప్రారంభించింది. "మొట్టమొదట నేను చెప్పాల్సిందేమిటంటే – ప్రతి ఒద్దికకూ మీరు వేళకి ఇక్కడకు చేరాలి. నాటకం వేసేందుకు అట్టే రోజులు లేవు. అందుకని ఒక్క నిమిషం కూడా వృధా చేయ లేము. ఒద్దిక నాలుగు గంటలకయితే, పది నిముషాలు ఆలస్యంగా కాకుండా దయచేసి పది నిమిషాలు ముందుగానే రండి."

ఆ రోజు ఆలస్యంగా వచ్చిన పిల్లలు తప్పు చేసినట్లుగా ఒకరి వంక ఒకరు చూసుకుని, నవ్వుకున్నారు. "అంతేకాదు; మీకు ఇచ్చిన పాత్ర గురించి గొడవ చేయకూడదు. కొన్ని పాత్రలు పెద్దవి. మిగతావి కావు. అయినా నాటకంలో ప్రతి పాత్రా ముఖ్యమైనదే. చిన్న పాత్రల వాళ్లకో సులువుంది. వాళ్లు కంఠస్థం చేయాల్సిన సంభాషణలు కొద్దిగానే వుంటాయి" అంది అనూ.

పిల్లలు నవ్వారు.

"మూడో విషయం ఏమిటంటే, మీరు మీ పాత్రల మాటలను త్వరగా నేర్చు కోవాలి. మీకు బడి తాలూకు "ఇంటి పని" లేదు కాబట్టి, బోలెడంత వ్యవధి వుంది. మీరు పంక్తులు వల్లిస్తుంటే విని, ముందు మాటలు అందివ్వడానికి ఎవరినైనా సహాయం అడగండి." "అందివ్వడం ఏమిటి?" అని అడిగాడు ఓ అబ్బాయి మిఠాయి తింటూ.

"మీ పంక్తుల ముందు వచ్చే పంక్తులు కూడా మీకు తెలిసివుండాలి. లేకపోతే ఎప్పుడు మీరు మాట్లాడవలసిందీ తెలియదు. నిజానికి, నాటకంలో అందరి పంక్తులూ త్వరలోనే మీకు కంఠస్థం అవుతాయి."

"అందుకని హుషారుగా వుండండి. అంత దిగులుగా ముఖాలు పెట్టవద్దు!"

కొద్దిగా పరీక్షచేసి, పాత్రలు పంచింది అనూ. కృతఘ్నుడి వేషానికి దీపక్

ఎన్నిక అయాడు. దిదోకు బ్రాహ్మడి పాత్ర, పారోకు రాజకుమార్తె వేషం ఇచ్చారు. మొదట్లో పారో కొంచెం సిగ్గుపడి, వేషం వెయ్యనంది. కానీ దిదో "నాటకంలో వేషం వెయ్యాలనుకున్నావుగా.. ఇప్పుడు గొడవ చెయ్యకు" అన్నాడు.

కోతి వేషంలో కాస్సేపు రంగస్థలం మీద టుప్పో కనపడవచ్చునన్నారు. కానీ తీరా, 'రంగస్థలం మధ్యకు' వెళ్లి, అందరి పాత్రలకూ అడ్డం పడితే వాడినెవడూ ఆపలేరు!

దీపక్ ఇంట్లో ఒద్దికలు పెట్టుకున్నారు. ముందు హాలుగది చిన్నదయినా, అతని తల్లి గదిలో సామాన్లు చాలామటుకు తీసేయడం వల్ల సగం ఖాళీ అయిన గది రంగ స్థలంగా మారింది.

రెండో ఒద్దిక జరుగుతుండగా, శ్రీమతి అన్వర్ ఓ కట్ట కాగితాలు పట్టుకొచ్చి, అనూకి చూపించింది.

"నాన్నా, నాన్నా" అనూ సంతోషంతో కేకవేసింది.

"ఒక్కసారి వచ్చి చూడు. అరె! మీరు నిజమైన కళాకారులు. అద్భుతంగా నమూనాలు వేశారు! ఈమె వేసిన దుస్తుల నమూనాలు ఎంత చక్కగా వున్నాయో చూడు!"

ఆవిడ పిల్లలు తప్ప, తతిమ్మా అందరూ ఆ నమూనాలను చూసి ఆనందాశ్చర్యాలను పొందారు. బొమ్మలు గీచే కాగితం ఒక్కొక్క దానిమీద ఒక్కొక్క పాత్ర బొమ్మ రంగు దుస్తులతో సహా, గీచివుంది. కాగితానికి ఒక మూలగా, ఏ రకం గుడ్డ ఏ రంగుది వాడాలో దాని తాలూకు ముక్క, తగిలించి వుంది.

"మీరు నిజంగా ఈ నమూనాలు తయారుచేయటం వృత్తిగా స్వీకరించి వుంటే బాగుండేది" అన్నాడు మామయ్య ఆశ్చర్యంతో. పిల్లలందరికీ కనబడేటట్లు ఆ చిత్రాలను బల్లమీద పరిచాడు. "మా రాబోయే నాటకానికి మీరు దుస్తులు ఎన్నిక చేస్తే చాలా సంతోషిస్తాను."

"చాల్లెండి ఎగతాళి" అంది శ్రీమతి అన్వర్ నవ్వుతూ. "అనూ, ఇప్పుడిహ పిల్లల కొలతలు తీసుకుంటాను. ఎందుకంటే రేపే బట్టలు కొని, కత్తిరించడం ప్రారంభించాలి."



"మీకు సాయం ఎవరన్నా వున్నారా?" అడిగింది అనూ.

"ఆ దీపక్ తల్లి వున్నారు. ఇంకా ఒకళ్ళిద్దరు పెద్ద అమ్మాయిలు పొద్దుటి పూట సహాయం చేస్తారు. మా దగ్గర రెండు కుట్టు మిషన్లు వున్నాయి."

దీపక్ బళ్ళో సంగీతం నేర్పే ఆవిడ ఒకసారి ఒద్దిక చూసేందుకు వచ్చింది. ఎంతో ఆనందపడి, తాను ఆ నాటకానికి సంగీతం కూర్చడంలో సహాయం చేస్తానంది. మొదట వేషాలు వేస్తామని ముందుకు వచ్చిన పిల్లలు కొందరు తర్వాత బలే సిగ్గు పడిపోయారు; కొద్ది రోజుల తరువాత వాళ్లని తీసేసి, మరి కొందరిని పెట్టుకోవలసి వచ్చింది.

దీపక్, దిదోల ఇళ్లు, తేనె పట్టుల్లాగ, హడావుడిగా, సరదాగా, కళకళలాడాయి. నాటకం వేయడానికి ఎంతో శక్తి కావాలి. చాలా సరదాగా వుంటుంది. కానీ క్షణం తీరిక వుండదు– అని గ్రహించాడు దీపక్. చిన్న చిన్న, ఒడి దుడుకులు వుండనే వున్నాయి. ఉదాహరణకు ఓసారి తను కొన్ని పంక్తులు మర్చిపోతే అనూ కోప్పడింది; ఇంకోసారి జుబ్బా బిగుతుగా వుందని విసుక్కుంది. జుబ్బా కుట్లు తీసేసి బాగుచేయమని పారో అమ్మ పారోకి యిచ్చింది. దాంతో పారో ముఖం ముడుచుకుంది. కానీ అవన్నీ చాలా చిన్న విషయాలు. తన జీవితంలో తనింతవరకు అంత ఆనందంగా ఎప్పుడూ లేదనిపించింది దీపక్‌కు.

# సుముహూర్తం

నాటకం వేసే రోజు ఉదయం, దీపక్, దిదో మామయ్యతో కలిసి కపూర్ గారింటికి వెళ్లారు. ఆవరణ అంతా పూలకుండీలతో డాబా కళకళలాడుతోంది. అక్కడక్కడా ఆకులు రాలి వున్నాయి.

“మొదట రంగస్థలం ఉపయోగించే చోటును శుభ్రం చేయాలి. తరువాత పూలకుండీలు ముందు ప్రక్క నుండి తీసెయ్యాలి. లేకుంటే చూచేవాళ్లకు ఏమీ కనపడదు.”

“తోటమాలి ఏడీ?” అడిగాడు దీపక్.

“అతడెందుకు?”

“డాబా చిమ్మేందుకు.”

“మనమే చిమ్మదాము” అన్నాడు మామయ్య, మూలవున్న చిన్న చీపురు అందుకుంటూ. “నాటక రంగంలో.. ఒక పని చేసేందుకు ఎవడో రావాలని కాచుకుని కూర్చోము. స్వయంగా మేమే చేసుకుపోతాము, దీపక్!”

“అబ్బే! అది కాదు. నేను చెయ్యనని అనలేదు” అన్నాడు దీపక్ చిన్నబుచ్చుకుంటూ.

“నువ్వూ, దిదో పూల కుండీలను జరపండి. ముందు ప్రక్క ఖాళీ వదలి వెనక పక్కగా వాటిని అందంగా అమర్చండి.”

నిముషాల మీద, ఆ అబ్బాయిలిద్దరూ, మామయ్యా కలిసి డాబా శుభ్రం చేసేశారు. సెట్స్, ఇతర సామగ్రి తీసుకుని, దీపక్ తల్లి, అనూ తరువాత వచ్చారు. మామయ్య స్నేహితుడు స్పాట్ దీపాలు, ఒక టేప్ రికార్డర్ తీసుకుని వచ్చాడు. దీపాలు ఏర్పాటు చేయడంలో దిదో అతనికి సహాయం చేశాడు.

అన్నీ ఏర్పాట్లు పూర్తయాక, భోజనం చేసి కాస్త విశ్రాంతి తీసుకునేందుకు, వాళ్లు యింటికి వెళ్లారు. శ్రీమతి అన్వర్, పారో బట్టలన్నీ ఇస్త్రీ పెట్టారు; ముఖానికి పూసుకునే రంగులు సిద్ధం చేశారు. సాయంత్రం నాలుగున్నర యేసరికి, వేషాలు వెయ్యవలసిన పిల్లలంతా కపూర్ యింటికి చేరుకోసాగారు. నాటకం ఆరు గంటలకు మొదలవుతుంది.

"అనూ, దయచేసి నేనూ, దిదో వున్న ఆ రంగం మరోమాటు ఒద్దికవేసి చూడు. అందులో నా పంక్తులన్నీ ఎప్పుడూ తప్పుపోతాయి" అన్నాడు దీపక్.

"దీపక్, నువ్విక బెంగపడకు హాయిగా విశ్రాంతి తీసుకోవటం నేర్చుకో" అని ధైర్యం చెప్పింది అనూ. "నీ పాత్రను చక్కగా నటిస్తున్నావు. మాటి మాటికి చేస్తే ఊరికే అలసిపోతావంతే. ."

"దయచేసి . ." బ్రతిమాలాడు దీపక్.

"అలాగయితే సరే. కానీ ఒక్క మాటే" అంటూ నవ్వింది ఆ చిన్నారి డైరెక్టరు. "దిదో, రావోయ్!"

ఆ రంగమంతా ఒద్దికవేసి చూశారు. దీపక్‌కు మళ్లీ ఓమాటు చేయాలని వుంది. కానీ అనూ ఏమాత్రం ఒప్పుకోలేదు. అనవసరంగా అతను అలిసిపోతాడంది.

దీపక్ కుర్చీలో కూలబడ్డాడు. తన పాత్ర చెప్పవలసిన మాటలు తలలో పూదర పెడుతున్నాయి. మనసంతా గందరగోళంగా వుంది. రంగస్థలం మీదికి వెళుతూనే పంక్తులన్నీ తప్పకుండా మరచిపోతానని పించింది అతనికి. నటీ నటులందరికీ ఇట్లాగే అనిపిస్తుందా?

"దిదో," పిలిచాడు స్నేహితుణ్ణి. అతను 'మెకానో' సెట్టుతో ఒక భవనం నమూనా తయారుచేయటంలో నిమగ్నుడై వున్నాడు. "సంభాషణ లేమిటో జ్ఞాపకమున్నాయా? నా వన్నీ అయోమయంగా వున్నాయి."

"నావి నాకు జ్ఞాపకం వున్నాయి" అన్నాడు దిదో నెమ్మదిగా. "ఆ దిక్కుమాలిన పంక్తులు కనీసం ఒక కోటి సార్లయినా వల్లించి వుంటాను. వాటిని వెనక్కు కూడా అప్పచెప్పగలను. వినిపించనా......"

"వద్దు బాబూ, వద్దు. నేను ఇంకా తికమక పడిపోతాను" అరిచాడు దీపక్.

ఎట్టకేలకు అయిదు గంటలయింది. కపూర్‌గారి తోటలోకి వెళ్ళేందుకు అంతా తయారయారు. తోటలోని డాబాకు దారితీసే గదిలో, శ్రీమతి అన్వర్, అనూ, మరో ఇద్దరమ్మాయిలు, నటీనటులకు మరీ ఎక్కువగా కాకుండా రంగులు పూశారు; దుస్తులు వేసుకోవడంలో సహాయం చేశారు. ఆరు గంటలకు ఇంకా ఇరవై నిమిషాలున్నాయి.

వేషమంతా వేసుకుని, సిద్ధంగా వున్న దీపక్ వున్నట్లుండి "దిదో ఏడీ?" అనడిగాడు.

"ఇక్కడ లేడూ? ఇందాకా ఒక "విగ్" ఎరువు తీసుకొస్తానని వెళ్ళాడే.." అన్నాడు మామయ్య. ఎవరికీ మనసు మనసులో లేదు. రఫీ లేకుండా నాటకం ఎలా ప్రారంభించగలరు? పారో కన్నీళ్ళ పర్యంతం అయింది.

"ఏడవకు పారో. ముఖాన రంగంతా పాడవుతుంది" చీవాట్లు పెట్టింది అనూ. నిజానికి అనూ కూడా బేజారెత్తి పోయింది.

ఇంతలో, "అదిగో! అక్కడ ..." అంటూ దీపక్ కేకవేశాడు. ఒక గుర్రపు బండి లోపలికి వచ్చింది. రఫీ బండి వాడి పక్కన కూర్చుని వున్నాడు."

"నా సైకిలు టైరులో గాలి పోయింది" అంటూ కిందికి దూకాడు, "టాక్సీ



దొరకలేదు" అతను వగరుస్తున్నాడు. గుక్కతిప్పుకోకుండా, "ఇంతలో ఒక గుఱ్ఱపుబండి వచ్చింది. గుఱ్ఱం చాలా మంచిది. పరుగు పరుగున దౌడు తీసు కుంటూ వచ్చింది."

"గుఱ్ఱం సంగతి అలా వుంచు" కోప్పడింది అనూ. "త్వరగా వెళ్లి దుస్తులు వేసుకో. బ్రతికాం బాబూ! నీకు అట్టే ముఖానికి రంగు అవసరం లేదు"

దీపక్ తేలికగా నిట్టూర్చాడు. ఆరు గంటలకి ఇంకా పది నిముషాలున్నాయి. మనసు స్థిమిత పడింది. భయం, వణుకుపోయాయి.

"రంగం మీదకు ప్రవేశించేందుకు, అందరూ వాళ్ల వాళ్ల స్థానాల్లో వెళ్లి నిలుచోండి" అన్నాడు మామయ్య చాలా నెమ్మదిగా. ఆ పాటికే తోటనిండా పిల్లలు, తల్లి దండ్రులు నిండిపోయి వున్నందున, ఆయన నెమ్మదిగా చెప్పాడు. "రెండు సార్లు గంట మోగిస్తాను. మొదటిది ప్రేక్షకులకు హెచ్చరిక, ... అది ఆరు గంటలకు అయిదు నిముషాలుందనగా మోగుతుంది. రెండోది సరిగ్గా ఆరు గంటలకు నాటకం ప్రారంభ మవుతుండగా మోగుతుంది. అందరూ బాగా నటించండి!" అంటూ ఆశీర్వదించాడు మామయ్య.

"అలాగే మామయ్యా!" అన్నారు పిల్లలు ఏకకంఠంతో. వాళ్ల వాళ్ల స్థానాల్లోకి వెళ్లి నిలబడ్డారు.

రెండో గంట మోగింది. ఆ సుముహూర్తం రానే వచ్చింది. నాటకం ప్రారంభమయింది.

* * * *

అది ఒక బ్రాహ్మణున్ని గురించిన నాటకం. అతడు చాలా ఉత్తముడు. కానీ కటిక దరిద్రుడు. తమ దారిద్ర్యాన్ని గురించి అతని పెళ్లాం ఎప్పుడూ సతాయిస్తూ, తిడుతూ వుండేది. చివరకు, అతడు, అదృష్టాన్ని వెతుక్కుంటూ బయలుదేరాడు. అలా పోతుండగా, దారిలో ఒక దట్టమైన అడవి వచ్చింది.

ఒకచోట "కాపాడండి.. రక్షించండి" అని దీనంగా రోదిస్తున్న కంఠాలు వినిపించాయి. అతడు చుట్టుప్రక్కల చూడగా, ఒక బావిలో, కోతి, పులి, పాము, మనిషి కనుపించారు. ఆ మంచి బ్రాహ్మణుడు పులినీ, కోతినీ, పామునీ పైకి తీసి రక్షించాడు. ఆ ప్రాణులు అతడి కెప్పుడు అవసరం తగిలినా, తాము సహాయం

చేస్తామని వాగ్దానం చేశాయి. అతడికి ధన్య వాదాలర్పించాయి. "బావిలో వున్న మనిషి మటుకు చాలా దుష్టుడు, క్రూరుడు. అతనికి సాయం చెయ్యవద్దు" అని హెచ్చరించాయి. కానీ దయార్ద్ర హృదయుడైన బ్రాహ్మణుడు ఆ మనిషి స్థితికి విచారించాడు. సానుభూతితో అతడిని కూడా బావిలోంచి బయటికి లాగాడు. అతను కాశీ వాస్తవ్యుడైన ఒక కంసాలి. బ్రాహ్మణుడు చేసిన సాయానికి తాను కృతజ్ఞుడిగా వుంటాననీ, తప్పక అతడి ఋణం తీర్చుకుంటాననీ, ఆ కంసాలి కొనియాడాడు.

ఒక సందర్భములో బ్రాహ్మణుడు చిక్కులు పాలయితే, కోతి అతణ్ణి ఆదుకుంది. ఇంకోమాటు, ఒక శవంమీద పడివున్న బంగారు గొలుసును, అతని నేస్తం పులి తీసుకొచ్చి బ్రాహ్మణుడి కిచ్చింది.

బ్రాహ్మణుడు ఆ గొలుసు తీసుకుని కాశీనగరం వెళ్లాడు. కంసాలిని కలుసుకున్నాడు. గొలుసు నతడి చేతిలో పెట్టి, దాన్ని అమ్మి పెట్టమన్నాడు. కృతఘ్నుడైన ఆ కంసాలి, ఆ గొలుసును బ్రాహ్మణుడికి పులి ఇచ్చిందని నమ్మనన్నాడు. ఆ గొలుసు అడవిలో హత్య చేయబడ్డ రాజుగారి కొడుకుదని గుర్తుపట్టాడు. వెంటనే ఆ వార్త రాజుగారికి తెలియజేశాడు. రాజకుమారుని చంపినవాడు బ్రాహ్మణుడేనని అతనిని కారాగారంలో బంధించారు.



అప్పుడు పాము ఆ బ్రాహ్మణుడి ఎదుట ప్రత్యక్షమయింది. తను రాజ కుమార్తెను కాటు వేస్తాననీ అప్పుడామెకు తెలివి తప్పుతుందనీ ఆ అమ్మాయిని ఎవరూ లేపలేరనీ చెప్పింది. ఆ పిల్ల వ్యాధి నయంచేసి మేలుకునేటట్లు చేయగల రహస్యాన్ని ఆ బ్రాహ్మణుడి చెవిలో ఊదింది.

ఆ పాము చెప్పినట్లే జరిగింది. రాకుమార్తెని పాము కాటు వేసింది. ఆమె గాఢ నిద్రపోయింది. ఆమె నెవరూ లేపలేకపోయారు. అప్పుడు, బ్రాహ్మణుడు మంత్రం వేయడంతో రాకుమార్తె లేచింది. కృతఘ్నుడైన కంసాలి తనమీద చేసిన హత్యారోపణ అసత్యమని బ్రాహ్మణుడు రాజుగారికి విన్నవించాడు. అతని మాటలు నిజమని కోతి, పులి, పాము వచ్చి సాక్ష్యం చెప్పాయి.

రాజుగారికి చాలా కోపం వచ్చింది. కంసాలిని ఉరిదీయమన్నాడు. కానీ దయాగుణం గల బ్రాహ్మణుడు కంసాలిని క్షమించమని రాజుగారిని వేడుకున్నాడు. కంసాలిని దేశంనుంచి బహిష్కరించారు. రాజుగారి నుండి ఎన్నో కానుకలు తీసుకుని, బ్రాహ్మణుడు సంతోషంతో ఇంటికి వచ్చాడు. అతని స్నేహితులయిన కోతి, పులి, పాము అతనితోపాటే వచ్చాయి.

దీపాలు ఆరిపోయి, అంతా చీకటవుతూండగా ప్రేక్షకులు సంతోషంతో చప్పట్లు చరిచారు. మొదట డైరెక్టరు అనూ, తరువాత నటీనట వర్గం వరుసగా వచ్చి రంగస్థలం మీద నిలబడ్డారు. దీపక్ మధ్యలో నిలబడ్డాడు. దీపాలు



వెలిగాయి. ప్రేక్షకులు ఇంకా సంతోషంతో చప్పట్లు చరిచారు. పిల్లలు వంగి నమస్కరించారు. "నేనో...నేనో" అని అరుస్తూ, టుప్పో ముందుకి పరుగెత్తాడు, చప్పట్లు కొడుతూ. అందరూ పక పక నవ్వారు. నాటకం అయిపోయింది. నటీనటులు, ప్రేక్షకులు కలుసుకుని, కులాసాగా ఖబుర్లు చెప్పుకోసాగారు.

నిండు పళ్లెం చేతిలో పట్టుకుని, "అందరికీ కోకో కోలాలు, మిఠాయిలు" అంటూ ముందుకి వచ్చింది శ్రీమతి కపూర్.

"బలే! బలే!" అని ఎగురుతూ పిల్లలు ఆమెని చుట్టేశారు.

* * * *

ఆవేళ రాత్రి, భోజనాల బల్ల చుట్టూ కూర్చుని, దీపక్, అతని తల్లి, అనూ, ప్రేమ్ మామయ్యా మాట్లాడుకుంటున్నారు. టుప్పో పక్క మీద పడుకుని నిద్రపోతున్నాడు. ఆ మరునాడే ప్రేమ్, అనూ వూరికెళ్లి పోతున్నారు.

"మామయ్యా!" అడిగాడు దీపక్ "నేను నటుడిని కాగలనంటావా?" "చూడబ్బాయ్, నువ్వు బాగా నటిస్తావు. కాని నువ్వింకా చిన్నవాడివి. పెద్దయ్యాక నటుడివిగా అవాలో ఇంకేమన్నా అవాలో ఇప్పుడే నిర్ణయించుకోలేవు. చదువు పూర్తయేలోపు, నీ మనసు మార్చుకోవచ్చు. తరువాత కాలేజీలో చేరాక కూడా నీ మనసు మారి పోవచ్చు. "నటుడి వృత్తి స్వీకరించడం మంచిదేనంటారా?" అడిగింది శ్రీమతి దాసు.



"ఎందుకు కాదు! నటీనటులకి మంచి భవిష్యత్తు వుంది. రేడియోలో, టెలివిషన్‌లో అవకాశాలున్నాయి. ముమ్ముందు అనేక నాటక బృందాలు దేశ మంతా తిరుగుతూ ముఖ్య నగరాల్లో ప్రదర్శనలు ఇస్తుంటాయి."

"దీపక్, ఈ మొదటి అనుభవం ద్వారా నువ్వు తెలుసుకున్న దేమిటి?" అడిగింది అనూ.

"నేను ఊహించిన దానికంటే అభినయం చాలా కష్టము, గంభీరము అయినదని తెలుసుకున్నాను" జవాబు చెప్పాడు దీపక్. "నటుడు అయేందుకు కష్టపడి పనిచేయాలి. తర్వాత, "స్కూలు ఆఫ్ డ్రామా"లో, విద్యార్థులు అనేక దేశాల నాటకాల గురించి చదవడం గమనించాను. యోగం, సంగీతం, నృత్యం వాళ్లు నేర్చుకుంటున్నారు. సెట్లు నమూనాలు దుస్తుల నమూనాలు వేయడం కూడా వాళ్లు నేర్చుకోవాలి. వాస్తవానికి నాటకరంగం గురించిన అన్ని విషయాలూ నటుడు తప్పకుండా తెలుసుకోవాలి లాగా వుంది."

"నిజమే.. అన్నీ నేర్చుకోవాలి-" అన్నాడు మామయ్య. "అప్పుడే అవతలవారి సమస్యలు, బాధ్యతలు ప్రతి ఒక్కరికీ తెలుస్తాయి. చూడండి, నాటక బృందం.." "ఒకజట్టు" అందుకున్నారు అనూ, దీపక్.

"అది గదీ!" నవ్వాడు మామయ్య. "కళ పట్ల భక్తితో అందరూ కలసి కట్టుగా పనిచేయాలి. అట్లా చేస్తేనే మన దేశంలో నాటకాలు వేయడాన్ని ఒక గొప్ప ఉద్యమంగా నిర్మించగలము."

"చీకటవుతోంది. పొద్దున్నే లేచి స్టేషనుకి వెళ్లాలి. ఇక పడుకుందాం పదండి. దీపక్, ముందు దీపాలు ఆర్పేయ్."

దీపాలు ఆర్పేందుకు లేచాడు దీపక్. "ఇప్పుడిహ బడి, పాఠాలు, పాత కార్యక్రమం మొదలుపెట్టాలి" అంటూ వెక్కిరింపుగా, దిగులు ముఖం పెట్టాడు.

"మంచి దేదయినా ముగియక తప్పదు. సెలవులూ అంతే" అన్నాడు మామయ్య. "భారతదేశపు భావి నటుడయిన దీపక్ దాసుకు జే..."

ఆ చల్లని మాటలతో, వింత వింత ఆలోచనలతో వాళ్లు నిద్రపోయారు.

Printed by Bharat Mudranalaya, Shahdara, Delhi-110032